# గంగా తరంగిణీ సారస్వత సమితి

## గంగాసదనము - మంథని

| | | |
|---|---|---|
| స్థాపన | : | క్రోధన సంవత్సర ఆశ్వయుజ శుద్ధ పంచమి 17-10-1985 గురువారము |
| వ్యవస్థాపకులు | : | "కవిశేఖర" శ్రీ గంగారాజేశ్వరరావు |
| మార్గదర్శకులు | : | శ్రీ గీట్ల జనార్దనరెడ్డి గారు |
| హితవరులు | : | శ్రీ. ch. రామకిషన్‌రావు గారు మేడిపల్లి. |
| అధ్యక్షులు | : | శ్రీ. ఇల్లెందుల సత్యానారాయణ గారు Msc |
| ఉపాధ్యక్షులు | : | శ్రీ గట్టు గణపతిగారు |
| ప్రధానకార్యదర్శి | : | డా. శ్రీ. శుకశ్రీగారు |
| నిర్వాహక కార్యదర్శి | : | శ్రీ పల్లి నారాయణగారు |
| సంపాదక కార్యదర్శి | : | శ్రీమతి ఎం రాజమణిగారు |
| సంచాలకకార్యదర్శి | : | శ్రీ వెంకటరాజన్న అవధానిగారు |
| ప్రచార కార్యదర్శి | : | శ్రీ దొంతుల లింగమూర్తిగారు |
| ఆర్థిక కార్యదర్శి | : | శ్రీ గంగామనోహరరావుగారు |

ఓం
త్రింశా
శ్రీ శారదాయై నమః

# పార్వతీ విజయము

( ప్రబంధము )

## గంగాతరంగిణీ ద్వితీయ తరంగము



అంకితము [illegible] గంగ

ఉ. ఈశ్వరి యర్ధమందు, మదకేశ్వరి మూర్ధమునందు [illegible] గంగ
జేశ్వర ! నేను నే ననుచు వీక్ష్యమెయిం గల [illegible]
శ్వేశ్వరుఁ డేలలేఁ డన హసింతురు, సాఁకులు చెప్పఁబోకు, రా [illegible]
జేశ్వర ! మత్కృతిన్ సతిగ స్వీకృతిసేసి యనుగ్రహింపుమా !

*

కృతికర్త :

కవిశేఖర

## కవిశేఖర గంగా రాజేశ్వరరావు

మంథని

---

This Book is published with the financial assistance of Tirumala & Tirupathi Devasthanams under their scheme aid to publish religious Books.

ప్రథమ ముద్రణ : జనవరి, 1987
అక్షయ సంక్రాంతి

ప్రతులు : 1000

మూల్యము : రు. 10 లు



ప్రతులకు :

**గంగా తరంగిణీ పారస్వత సమితి**
గంగాసదనము, మంథని,
కరినగరం జిల్లా - 505184.
ఆం. ప్ర.

---

ముద్రణ :
**శామ ప్రింటింగ్ వర్క్స్,**
**తిలక్‌నగర్, హైదరాబాదు - 500 044.**




సరససత్కావిరూపాం
రసాలంకారశోభితాం
శారదా మయస్వభావాం
వందే గంగాతరంగిణీమ్॥

*

## ఉద్దేశ్యములు - లక్ష్యములు

1. పుస్తక ప్రచురణము - విక్రయము
2. సాహితీ కవిసమ్మేళనముల నిర్వహణము
3. సాంస్కృతిక కార్యక్రమముల, ఉత్సవాల నిర్వహణ
4. ప్రముఖ కవి పండితుల సన్మాన సత్కారముల ద్వారమున సాహితీ సేవ
5. గీతా మూలకముగ సంస్కృత భాషా బోధనము



ఓం

శ్రీ శారదాయైనమః

# గంగా తరంగిణీ ద్వితీయ తరంగ సమాహ్వానము

మా యీ గంగా తరంగిణీ ద్వితీయ తరంగ సమవగాహ మొనరింపఁ గోరు రసజ్ఞులందఱికి నివేసమాహ్వానమ్ము. శ్రీరామకృష్ణానందాశ్రమాధ్వర్యములో ప్రథమ తరంగము రుక్మిణీకల్యాణమ్ము ముద్రించి ప్రచురితమైనది. ఈ సందర్భముగ నాశ్రమ వ్యవస్థాపకులైన శ్రీరామకృష్ణానందస్వామి వారికి నాశ్రమ నిర్వాహకుల కుఁ గృతజ్ఞతాభివందనసహస్రములు. గతమున నేతత్కృతికర్తలు శ్రీ రాజేశ్వరరావు గారు తమకృతుల ప్రచురణాధికారము రామకృష్ణానందాశ్రమమున కిచ్చుటేగాక ముద్రణవ్యయనిమిత్తము 15000/-లు గూడ స్వామి వారి పేర బ్యాంకులో డిపాజిట్ చేసియుండిరి. కాని, రుక్మిణీ కల్యాణ ముద్రణానంతరము, మిగిలిన గ్రంథముల ముద్రింపఁ జాలమని మిగిలిన 12000/-లు తిరిగి యీయఁగా దానిని కృతికర్త పేరనే డిపాజిట్ చేసితిమి. ప్రస్తుత మీ కార్యభారనిర్వహణకై యొకసమితి యత్యవసర మగుటచే 17-10-85 గురువారమునాఁడు శ్రీ గంగా రాజేశ్వరరావు గారి వ్యవస్థాప కత్వమున గంగాతరంగిణీ సారస్వతసమితి యవతరించినది. ఇఁక మిగిలిన తరంగముల ప్రచురణబాధ్యత సమితికే చెందు నని యిందు మూలముగఁ ప్రకటించ నైనది. ముందు ముందు కేవలము పై వ్యవస్థాపకుల రచనలే గాక మంథనికి సంబంధించిన ప్రముఖకవులయు సాహితీవేత్తలయు రచనల సేకరించి ముద్రించి రసజ్ఞుల కందింపఁ గల మని మనవి చేయుచున్నాము

ఇఁకఁ గృతినిఁ గూర్చి చెప్పెదము, మాటలు ఇందు వివిధచ్ఛందోభంగిమలు, ప్రధానముగ విభిన్న రగడలు ప్రదర్శితములు శబ్దార్థాలంకారవర్ణనలు స్వతస్సిద్ధములై రసానుగుణపాత్రోచితములై యొప్పును వీనిని వివరింపఁ బూనుట లేని యర్హత నాపాదించుకొను నట్టిది.

అన్నట్లీకృతికర్త గీతాగానమున్ను శ్రీ చెప్యాల రామకిషన్‌రావు గారు ముద్రింపఁజేయ వాగ్దాన మొసంగిరి ఇంక నిట్టి సత్కార్యమున కెవరైన సంసిద్ధులైనచో సాదరముగ నాహ్వానింతుము.



ఇట్లు

డా॥ శుకశ్రీ

ప్రధాన కార్యదర్శి

గంగా తరంగణీ సారస్వతి సమితి

# పీఠిక

ప్రబంధరచనా ప్రక్రియ ఇంచుమించు అంతరించిన ఈ ఆధునిక యుగంలో సుకవిజనకమలమిత్ర గంగారాజేశ్వర కవిశేఖరులు ఈ పార్వతీవిజయ ప్రబంధమును రచించి కృతార్థులైనారు.

పార్వతీపరమేశ్వరులే ఈ ప్రబంధమున నాయికానాయకులగుట విశేషము. ఇది మూడుఖండముల ప్రబంధము.

సతీవియోగము, గౌరీజననము, గిరిజాకల్యాణము అను ఖండత్రయ సమన్వితమీ ప్రబంధము.

విషాదముతో ప్రారంభించి వినోదముతో ఈ ప్రబంధము ముగుస్తుంది. ఇది ఒక నూతన ప్రక్రియ. మంగళాదీని, మంగళమధ్యాని మంగళాంతాని అని కావ్యములు ముత్త్రివిధములు.

ఈ కావ్యమున తొలి ఖండమున సతీవియోగగాథ వర్ణితము. దక్షుడు అహంకారమున అశివమైనమఖ మొనర్పబూనుట, సతీదేవి ఆ యాగమునకు వెళ్ళుట, తండ్రి అవమానించుట, సతీదేవి దేహత్యాగము చేయుట, వీరభద్రుడు దక్షుని గూల్చుట, ఆ పిమ్మట శివుడు దక్షుని అనుగ్రహించుట ప్రథమఖండము నందలి యంశములు.

ఈ ఖండమున కరుణ వీర రసములు రంగులీనినవి.

"ధర్మమునకే జయము దక్కును" (158)

అనునది కవి వాక్కు. అస్తు.

వీరభద్ర విజృంభణము ఇందు అద్భుతముగా వర్ణితము.

"దక్షశిరంబు ద్రుంచియును వచ్చి రంబు
హరహరా! కొను మిదియ పూర్ణాహుతి యని
భగ్గు భగ్గున మండెడు నగ్గి యందు
వ్రేల్చె, శివునాజ్ఞలను నెర వేర్చెనంత"

"తల లేక పడియున్న దక్షునకును మేషశిర మతికియు లేపె శివుడు దయను" దయామయుడైన శివుడు శత్రువునైనను నను గ్రహించును కదా!

"లేగలు పొదుగును గ్రుమ్మిన బాగుగ పాలిచ్చు గోవు"
వంటివాడు శివుడు.

ఈ ఖండమున భిన్న భిన్న వృత్తములు, జాతులు, ఉపజాతులు ప్రయోగించబడినవి.

అక్కలి ప్రాసనీసము కూడ కలదు. కవిగారి అపారధారాశుద్ధికి, పాండితీ ప్రకర్షకు ప్రతిపద్యము తార్కాణము.

ద్వితీయఖండమున గౌరిజనన వృత్తాంతము గౌరిబాల్యక్రీడలు, యౌవనదశ, శివునారాధించుట. కామదహనము, పార్వతి తపస్సు వర్ణితములు.

ఈ ఖండమున కవిగారు శృంగారరసమును సమర్థవంతముగా పోషించినారు.

ఎన్నో రకాల రగడలు ఈ ఖండములో ప్రయోగించ బడినవి. మానినీ వృత్త గర్భ హరిగతి రగడ, విజయ వృత్తరూప తురగ వల్గన రగడ, విజయ భద్ర రగడ మొదలైనవి ఇందున్నవి.

మధ్యాహ్న సమయమును కవిగారు కంద పద్యములో ఎంతో చక్కగా వర్ణించారు–

"నీడముల జేరు ఖగములు
నీడల పశువులును జేరి నెమరులు వేయన్
నీడలు పదముల జేరును
వేడివెలుగు తలను జేరు వేళలయందున్" (64)

సూర్యుడు తలను చేరినప్పుడు నీడలు పదములను జేరుటను కవిగారు మనోహరముగా చెప్పినారు.

ఈ ప్రబంధమున తృతీయఖండ మత్యద్భుతము. కపటవటుడు పార్వతీ దేవిని పరీక్షించు రీతి మనోహరముగా నున్నది. నిశ్చలచిత్తయైన పార్వతి వటుని మాయమాటలకు లొంగదు. తుదిని తపస్సిద్ధి కలుగును.

శివసాక్షాత్కార వర్ణనము రమణీయముగా నున్నది.

''అధరామృతంబు గంగామృతంబును గూడి
అమృతంపుసోనయై అలరుచుండ
కలువ కంటిని బ్రియమున గను కటాక్ష
వీక్షణానేక కిరణముల్ వెడలుచుండ
బ్రాగ్దిశాకాశమున నపర్ణా చకోర
చంద్రుడో యన గన్పట్టె చంద్రమౌళి'' (297)

గిరిజా కల్యాణమును గంగారాజేశ్వర కవిశేఖరులు కన్నులకు కట్టించినారు. పెండ్లి తంతు అంతయు ఎంతో సొగసుగా చెప్పినారు. అచ్చమైన తెలుగు పెండ్లి ఇది:

''అనిమిషనిమేషజనులు తిర్యగ్గడములు
పార్వతీశంకరులపెండ్లి పరమశోభ
ప్రకృతి పురుషుల కిద్ది వివాహ మంచు
హర్షడోలాయ మానసులై చెలంగ''

ఉమామహేశ్వరుల వివాహము జరిపించారు కవిగారు.

''మంగళము శంభునకు, మంగళము పార్వతికి''

అంటూ ప్రబంధము తుదిని మంగళ మహశ్రీ రచించినారు.

ఇది మహా ప్రబంధము. ఇందలి నాయికా నాయకులు సాక్షాత్తు ఆదిదంపతులు. కవీశ్వరుడు గంగా రాజేశ్వరుడు.

నవరసభరిత మైన ఈ ప్రబంధము ఆంధ్ర కవితా వనవాటికలో మధుర మాకందము.

మాతృశ్రీ మందిరము
హైదరాబాదు-29
అక్షయ వైశాఖ పూర్ణిమ
23 మే 1986

దాశరథి

ఓం శ్రీ సాయినాథాయనమః

# కావ్య సమీక్ష

భగవంతుని కథలు ఎన్నిసార్లు చదివినా, ఎందరినోట విన్నా చవులూరిస్తూ, మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తుంది; విసుగులేక వినాలనిపిస్తుంది. అందులోని ఆ పాత మాధుర్యం అనిర్వచనీయం, అనుభవైకవేద్యం. కనుకనే నేటికి కూడా ప్రాచీనపురాణగాథలు పలువురిచేత, పలువిధాలుగా వ్రాయబడి ప్రాచుర్యం పొందటం మనం గమనిస్తూనే వున్నాం. విచిత్రంలో విచిత్రం ఏమిటంటే ఇంత ఆధునిక పరిజ్ఞానంలో కూడా పురాణాలు అందులోని కథలు మరుగున పడిపోకుండా మరింతగా వేళ్ళు పాతుకొని నిలద్రొక్కుకోవటమే.

శివపార్వతులు ఆదిపురాణదంపతులు. హరపార్వతుల చరిత్రలు, దురితఘ్నంబులును దుఃఖదూరీకృతములు, పరమసుఖప్రాప్తంబులు, నిరుపమ కల్యాణములకు నెలవులు. అట్టి వాటిని ఎంతో కవిశేఖరులు బ్రహ్మశ్రీ గంగారాజేశ్వరరావుగారు 'పార్వతీ విజయము' కావ్యాన్ని ముచ్చటగా మూడు ఖండాలలో నిబద్ధం చేసి, భవబంధ విమోచనుడైన పరమేశ్వరునకు అంకితమిచ్చారు. చాలా చక్కని సంప్రదాయానికి మరోసారి జీవం పోశారు.

చక్కగా సంప్రదాయ రీతిలో ఛందోబద్ధంగా కవిత్వాన్ని పలుకగల దక్షులు, పద్యాన్ని కదనతురంగంలా పరుగెత్తించగల ప్రతిభావంతులు సుసిద్ధులైన కవీశ్వరులు కాలానికి దూరమౌతున్న, వచన కవిత్వమే శరణ్యమని భావిస్తున్న ఈ ఆధునిక యుగంలో శ్రీ రాజేశ్వరరావుగారు లాంటి వాళ్ళు అక్కడక్కడా, అడపాదడపా ఇట్లాంటి ప్రబంధాలు ప్రచురించటం చూస్తుంటే గొప్పసాహసం చేస్తున్నారనిపించక మానదు. కవిత్వాన్ని ఏ రూపంలో పలికినా ఆదరించి అభిమానించే వాళ్ళకి కరువులేదనీ, రసనిర్భరమైనకావ్యాన్ని శిరోధార్యంగా భావించే సహృదయులకు తెలుగు గడ్డపై కొరతలేదనీ, కల్పనానల్పశిల్పచాతుర్యాన్ని పరికించి, శిరసులూపే సరసులు ఇంకా అక్షయంగానే ఉన్నారనీ, పాత సంప్రదాయానికి సమాధి కట్టుటమంత తేలికైన పని కాదనీ పుంజుకొన్న ఆత్మవిశ్వాసంతో పుష్కలమైన సంప్రదాయ గౌరవంతో

పురాణ వాఙ్మయం మీద ఉన్న అకుంఠితమైన భక్తిప్రపత్తులతో సాహితీ సుసంగతులకు ఉపాదేయంగా, ఉపాయనంగా తమ కావ్యాన్ని సమర్పించి ధన్యులైనారు శ్రీ రావుగారు. ఇది ప్రస్తుతిపాత్ర మనక తప్పదు.

పార్వతీవిజయం కావ్యంలోని ప్రథమ ఖండంలో సతీవియోగం, దక్షాధ్వరధ్వంసం, ద్వితీయ ఖండంలో గౌరీ జననం, తపస్సు, తృతీయఖండంలో కుహనావటువు ఆగమనం, పార్వతీ పరిణయం ప్రధాన కథలుగా దిద్ది తీర్చబడినవి.

ఈ కావ్యములో తృతీయ ఖండ ప్రారంభంలో "శంకరుని పరీక్షను నా శాంకరి విజయమ్ము నెట్లు సాధించెను? కూలంకషమ్ముగ జెప్పు" దని సూత మహర్షిని శౌనకులు ప్రశ్నించినట్లూ (89 పేజి) ద్వితీయ ఖండంలో (87 పేజి) పార్వతి తపస్సు చేస్తుండగా ఆ తపోగ్నిశిఖలు స్పృశించగా - పార్వతిని పరీక్షించుటకై దయాబ్ధియైన పరమశివుడు బయలుదేరినట్లూ - తృతీయ ఖండంలో మాయావటువు శివరూపంతో సాక్షాత్కరించినప్పుడు చెలికత్తె "నిన్ను పరీక్షించుటకే వన్నుగడం బన్నినాడు పరమేశ్వరుడు" (113 పేజి) పలికినట్లు వ్రాయుట పరిశీలిస్తే పార్వతిగా రూపాంతరం చెందిన సతీదేవి హరుని పరీక్షలో నెగ్గి విజయం సాధించిన ఇతి వృత్తాన్ని స్వీకరించటం చేత - తమ కావ్యానికి పార్వతీవిజయ మని పేరు పెట్టా రనిపిస్తుంది. పార్వతీకల్యాణం అని కాకుండా పార్వతీ విజయం అని నామకరణం చేయటంలో మరేమైనా కారణం ఉందా? అని ఆలోచిస్తే జీవేశ్వరుడైన పరమశివునిపై ప్రకృతిస్వరూపిణి పార్వతి సాధించిన విజయగాథ ఈ కావ్యములోని ఇతివృత్త మని స్ఫురించక మానదు.

సంస్కృతంలో కాళిదాసు, తెలుగులో నన్నెచోడుడు, మొదలైన మహామహులెందరో శివపార్వతుల గాథను కమనీయంగా వర్ణించారు. ఎవరి మార్గం వారిది. ముఖేముఖే సరస్వతి. వాస్తవాన్ని పరిశీలిస్తే మొదటి నుంచి భారతీయ కవులకు ప్రతిభపై గల దృష్టి నూతన కథలు సృష్టించటంలో లేదనిపిస్తుంది. రసోచిత కల్పనా నైపుణ్యమే - నవనవోన్మేషమైన ప్రజ్ఞయే ప్రతిభ. "దృష్టపూర్వా అపిహ్యర్థాః కావ్యేరసపరిగ్రహాత్, సర్వేనవా ఇవాఽభాంతి మధుమాస ఇవద్రుమాః" కావ్యాలలోని ఇతివృత్తం ఇంతకు ముందే మనకు తెలిసినదైనప్పటికీ రసపరిగ్రహణంవల్ల వసంతకాలంలోని వృక్షాలమాదిరిగా ఎప్పటికప్పుడు మనకు క్రొత్తగా కనిపిస్తూ, అలరిస్తూ ఉంటవని మన ఆలంకారికులు

ఉద్ఘాటించి కల్పనారమణీయతకు పట్టం కట్టటం జరిగింది. ఈ కల్పనలు ఎంత ఉదాత్తంగా ఉంటాయో ఆ కావ్యం అంత జగన్మోహనంగా ఉంటుందనటంలో ఎట్టి విప్రతిపత్తి ఉండదు.

ఈ కావ్యంలో శ్రీ రాజేశ్వరరావుగారు కొన్ని రసోచిత కల్పనలు చేసి తమ కావ్యానికి నూతనత్వాన్ని సముపార్జించి పెట్టి నవీన గుణ సనాథులైనారు ఆ కల్పనలలో మొదటిది దక్షునికి శివునిపై కోపం రావటానికి గల కారణాన్ని సృష్టించటం (13పేజి) దీన్ని సుసం సన్నివేశ కల్పనగా పరిగణించవచ్చు. భాగవతంలో (4 - 2 - 37) "తొల్లి బ్రహ్మలు జనసుతముగ జేయునట్టి సత్రము జూడన్" దక్షుడేగినట్లు ఉంటే శ్రీ రాజేశ్వరరావు గారు కైలాసంలో నిండుపేరోలగంలో పరివేష్ఠితుడైన శివుణ్ణి చూడటానికి వచ్చినట్లు, అక్కడ బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తప్ప తక్కిన వాళ్ళందరూ లేచి గౌరవించారనీ, బ్రహ్మ తండ్రి కావటం చేత, విష్ణువు తాత కావటంచేత వాళ్ళు తనను గౌరవించక పోవటంలో తప్పులేదు కాని పితృసమానుడైన మామ స్థానంలో ఉన్న తనను నిర్లక్ష్యం చేయటం శివునికి తగిన పని కాదని కోపించినట్లు వ్రాయటం ఔచితీ సహితమైన కల్పన-భాగవతంలో దక్షుని పత్తాసుగా భృగువు శివుని శపించటం ఇందులో లేదు అసలు భృగువు పాత్ర ప్రమేయం లేకుండా దక్షుడే ఆ శాపం ఇచ్చినట్లు కల్పించి దక్షుని దోషాన్ని మరింత ఎక్కువ చేసి పాత్రచిత్రణా కౌశల్యాన్ని వెల్లడించారు.

మరొక కల్పన సతీ శంకరుల వన విహారం. ఇది ప్రబంధోచితవర్ణనగా కనిపించినా భావికథాంశ సూచనగా దాన్ని ఉపయోగించి మహత్తర కావ్యశిల్ప ప్రయోజనాన్ని కవిశేఖరులు సాధించటం జరిగింది-భవిష్యత్తులో సతీవియోగం రానున్నది-ఆ వియోగాన్ని తట్టుకోవటానికి సతీశివులిద్దరూ సంసిద్ధం కావలసి ఉంది-ఈ విధమైన ప్రయోజనాన్ని ఆకాంక్షించే భవభూతి ఉత్తరరామచరితలో చిత్రఫలక సందర్శనంద్వారా సీతారాములను రాబోయే వియోగాన్ని సహించటానికి సంసిద్ధుల్నిచెయ్యటం మనం చూస్తాం. వన విహారం చేస్తూ ఆనందతన్మయంలో నతీశివులుండగా "ప్రకృతి హరాద్వికారంబుగాంచె (17 పేజి) నని రాజేశ్వరరావు గారు వ్రాయటం కావ్య శిల్పానికి పరాకాష్ఠదశ. వన విహారం సతీదేవి ప్రకృతి-భవిష్యత్తులో వికాసం పొందబోతుందని సూచన-

పైగా శివునిచేత "నీకు నాకు నెడము నేడొ రేపో?" అని కంఠోక్తిగా పలికించి భవిష్య వియోగ భారవహనానికి సతిని సంసిద్ధం చేయటం మనం గమనిస్తాం.

మూడో ముఖ్యమైన కల్పన శుకరాయబారం పైకి ప్రబంధోచితవర్ణనగా గోచరించినా ఈ కల్పనకూడా మహత్తరప్రయోజనార్థమై కల్పించబడింది. ఈ శుకం మామూలుశుకం కాదు-జగజ్జననికరంపై నిత్యం అలరారే లీలాశుకం -కైలాస వాసుని కడకు వెళ్ళి, పార్వతి విరహవ్యథను చాకచక్యంగా వర్ణించి "శక్తివాసి నీ వశక్తుండవైతివి శక్తిఁగూడు సర్వశక్తి యుక్త (129 పేజి) ఇత్యాదిగా పలికిన పలుకులు శివునికే కాదు మనకు గూడా ఆశ్చర్యాన్ని కలిగించి, "ఇవి చిలుక పలుకులా!" అని గుండెపై చెయ్యి వేసుకొనేటట్లు చేస్తవి. ప్రభావతీ ప్రద్యుమ్నంలో సూరన్న ప్రతిభాపాటవంతో చతుర శోభితంగా చిత్రించిన ప్రధాన పాత్ర శుచిముఖి కెంత మాత్రం వచో నిపుణత్వంలో తీసిపోని విధంగా ఈ శుకం చిత్రించబడింది. "వాగర్థావివ సంపృక్తౌ" అని కవికుల గురువు కాళిదాసు ప్రవచించి అర్ధనారీశ్వరతత్త్వ రహస్యాన్ని చాటి చెప్పినట్లు సతీవియోగానంతరం ప్రకృత్యంశ లేనిశివుడు కేవలం సాక్షీభూత చిహ్నమైన 'దక్షిణామూర్తి' గా యోగసమాధిస్థితిలో ఉండటం ప్రపంచప్రయోజనానికి ఉపకరించలేదు కనుక తిరిగి ప్రకృత్యంశ యైన శక్తితో కలిసి లోక కల్యాణం కావించవలసిందిగా కేవలం అల్ప పాత్రయైన శుకం ద్వారా మహత్తర యోగశాస్త్ర రహస్యాన్ని చెప్పించటం శ్రీ రాజేశ్వరరావు దర్శనానికి చక్కని నిదర్శనం.

మాయా బ్రహ్మచారి పార్వతి సంవాదంలోని వినూత్నత, అక్కడి సన్నివేశ కల్పనలు హృద్యంగా ఉన్నవి. నారదుని పాత్ర చిత్రణలో శ్రీ రాజేశ్వరరావు గారు చూపిన మెలకువ ప్రశంసాపాత్రంగా ఉంది. శివ సమక్షంలోనే సతీదేవితో జనాంతికంగా భవిష్యత్తులో జరుగబోవు దక్షాధ్వర ధ్వంసంగా ఆమె నిర్వహించవలసినపాత్రను బోధించిఉంటా డనిపించేటట్లు చిత్రించటం జరిగింది. (18వ పేజి) ఆ తర్వాత శివుడు "కాగల పని కొఱకు కావలసినయట్టి బీజములను నాటి వెడలెమౌని" (19వ పేజి) అని తనలో అనుకొన్న మాటలు పై యభిప్రాయాన్ని బలపరుస్తున్నవి ఇది ఎంతో మెలకువతో చిత్రించిన అంశ మనక తప్పదు. తిరిగి ఈ నారదుడే పార్వతిదగ్గరకు వెళ్ళి తపస్సు చేసి శివుని గెలువవలసిందిగా బోధించి, శివపంచాక్షరీ మంత్రాన్ని

ఉపదేశించి శివపార్వతీ కల్యాణానికి సంధాన కర్తగా నిలిచినట్లు వ్రాయటం నారదుని లోకకల్యాణకాంక్షను, దేవకార్యనిర్వహణ దీక్షను కవిశేఖరులు ఎంతగా హృదయగతం చేసుకొన్నారో నిరూపిస్తున్నది.

ఆ యా వ్యక్తులు సజీవమూర్తులుగా, మనకట్టెదుట సాక్షాత్కరించినట్లు పాత్రను చిత్రించటానికి ఎంతో నైపుణ్యం కావాలి. కావ్య కళలో సిద్ధహస్తుడైన వానికి గాని ఈ నేర్పు సిద్ధించదు. శివుని పేరోలగానికి విచ్చేస్తున్న దక్షుని (12 పేజి) కుహనావటువేషాన్ని పరిత్యజించి పార్వతి యెదుట ప్రత్యక్షమైన శివుని (110 పేజి) వర్ణించిన విధం రాజేశ్వరరావుగారి పాత్ర చిత్రణా నైపుణ్యానికి గీటురాయి. సాక్షాత్కరించిన ప్రియుణ్ణి జూచి గౌరీదేవి ప్రకటించిన హావభావ విలాసాదులను "చూపు చూపును గలిసెను సొంపు మీఱ, మోముదామర విరిసెను ముగుద కపుడు, తరుణి చెక్కిళ్ళ మెఱుగులు దళుకు లీనె, వనజ నేత్రమొల్ల వ్రాలెను వసుధవైవు, శిరము లేచెను గొంచెము చిత్రమెదుటి కనులు పిలిచెను వెంటనే కాళ్ళు గదలె, దేహమో! స్వామి కడనిల్చె దిశలు మెఱసె" ఇత్యాదిగా నాటకీయవైఖరిగా వర్ణించిన విధము నాన్యతోదర్శనీయము. దేవతాశీస్సులచే పునరుజ్జీవితుడైన మన్మథునిచే 'నాడు స్వప్నమందు నన్ను భగభగమని వచ్చి మంట బూడిదగను కాల్చె' (75 పేజి) అని మన్మథునిచే పలికించటం చూస్తే అతడు తాను నిజంగా ముక్కంటి కంటి మంటకు ఆహుతై తిరిగి జీవించినట్లు ఎరుగక అది కేవలం స్వప్నావస్థగా భావించాడనే కొత్త వూహ వెలిబుచ్చటం పాత్రౌచిత్యాన్ని వెలారుస్తున్నది.

కవిశేఖరులుగారు కావ్యశిల్పంపట్ల ఎంత శ్రద్ధ వహిస్తారో ప్రతిచిన్న విషయాన్ని ఎంత మిన్నగా మెరుగు పెడతారో అర్థం చేసుకోవటానికి పార్వతీ తపస్సు చాలు. పార్వతీదేవి మునిజనుల శుభాశిస్సులంది మహోగ్రతపోదీక్ష గ్రీష్మంలో చేపట్టింది. హేమంతంలో తపస్సు సిద్ధించి శివసాక్షాత్కారం లభించింది. శిశిరంలో సప్తర్షులను దౌత్యం నెరపవలసిందిగా శివుడు అభ్యర్థిస్తే వారు వసంతారంభంలో హిమవంతుని కడకు రావటం జరిగింది. ఈ వసంతంలోనే గౌరీ కల్యాణము. రాజేశ్వరరావుగారు ఈ విధంగా

ఒక సంవత్సర కాలపరిధిని పార్వతి తపస్సుకు నిర్దేశించటం పరికిస్తే ఈ పార్వతీ విజయంలో ఒక వార్షిక సత్రయాగాన్ని పోలి ఉన్నదన్నట్లు చిత్రీకరించి పార్వతి తపస్సు యావత్తు విశ్వ కల్యాణహేతువైన ఒక యజ్ఞ స్వరూపంగా స్ఫురింపచేసినట్లు, ప్రకృతి షడృతువులైన తన సంపూర్ణకళతో పురుషుణ్ణి చేరిందని ద్యోతక మగునట్లు తన ఇతివృత్తాన్ని మలచుకోవటం కవిశేఖరుల కావ్యశిల్పానికి నికషోపలంగా ఉంది.

ఉత్సాహము, మానిని, స్రగ్విణి, రగడ, భుజంగ ప్రయాతము మొదలైన విలక్షణఛందస్సులు ప్రబంధశైలికి అనుగుణంగా వాడినప్పటికీ భాషావిషయకంగా శ్రీ రాజేశ్వరరావుగారు తీసుకొన్న శ్రద్ధ ప్రశంసనీయము. అలతి అలతి తెలుగుపదాలతో, చక్కని జాతీయాలతో, సామెతలతో అత్యంతం కావ్యాన్ని ప్రసాదగుణ భూయిష్టంగా, పండిత పామర హృదయ రంజకంగా ఉండటం ముదావహం. పార్వతీదేవి బాల్యక్రీడలలోను, శివ పార్వతుల వివాహంలోను తెలుగు వారి ఆచార వ్యవహారములను జొప్పించి శివ పార్వతులను తెలుగింటి వారలజేయటం చూస్తే కవిశేఖరులకు స్వస్థాన వేష భాషలపై గల అభిమానానికి ఆశ్చర్యం వేస్తుంది. "జలధరములోనిజల మన, జలజారిని గూడియున్న చంద్రికయె యనన్, జలరుహములోనిమధు వన, జలజాసన మెప్పుచుండె శశిధరు మోలన్" (115 పేజి) అన్న ఒక్క పద్యం చాలు రాజేశ్వరరావు కవిశేఖరత్వం ఎంత సార్థకమో నిరూపించటానికి.

ఇంత వరకు కవిశేఖరుల కమనీయకవితాశిల్పనైపుణ్యాన్ని విహంగమాత్రంగా సమీక్షించటం జరిగింది. చివరికి ఒక మనవి. మన ప్రాచీన సాహిత్యంలో ఎన్నో యోగశాస్త్రరహస్యాలు పురాణగాథల రూపంలో అత్యంత మహిమాన్వితులైన మహర్షులు మనకు అందించారన్న విషయం మనలో చాలా మందికి తెలియదు. ఉదాహరణకు ఈ కావ్యంలో చెప్పబడిన దక్షాధ్వరధ్వంసం తీసుకొందాం. ఈ దక్షాధ్వరధ్వంసం ఒక విశిష్టమైన ఖగోళపరిణామాన్ని సూచిస్తున్నది. ఈ విషయం అర్థం చేసుకోవాలంటే జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానం కావాలి. మన హిందూమతసంప్రదాయానికి వేద పురాణేతిహాసాలు మూలా

స్తంభాలు పురాణ గాథలకు వేదములే ఆధారమని అంటున్నారు. కాని పురాణాలు అనుపేరుతో వేదాలకన్న ప్రాచీనమైనచరిత్రను మహర్షులు మనకు అందించటం జరిగింది. ఈ గాథలలోని రహస్యాలు అర్థం కావటానికి వేదాంగాలలో అతి ప్రధానంగా చెప్పబడుతున్న "జ్యోతిషం" అనే కన్ను చాలా అవసరం. 'దక్షాధ్వరం' గాథలోని విశేషాన్ని జ్యోతిషపరంగా పరిశీలించాలంటే అసలు దక్షుడంటే ఎవరో? మనం అర్థం జేసుకోవలసి ఉంటుంది.

దక్షుడు ప్రజాపతులలో ముఖ్యుడు. ''యజ్ఞో వై విష్ణుః", "యజ్ఞో వై ప్రజాపతి", "యజ్ఞః సంవత్సరః" (ఐతరేయ బ్రాహ్మణము) అని శ్రుతులు చెబుతున్నవి. యజ్ఞ మనగా సంవత్సరము, అంటే సంవత్సరమే దక్షుడు. అనగా ద్వాదశరాశుల జ్యోతిశ్చక్రమే ఇతని స్వరూపము. ఈనాడు రాశిచక్రం శిరోభాగాన మేషరాశి ఉంది. ఇది అశ్విన్యాదిగా ప్రారంభమౌతుంది. కాని ప్రాచీన కాలంలో కృత్తికాదిగా ఈ నక్షత్రాలున్నట్లుగా వేదాలు (తైత్తి. సంహి) చెబుతున్నవి. అంటే ఆనాడు మేషరాశి జ్యోతిశ్చక్ర శిరోభాగాన లేదని తెలుస్తున్నది. అలాగే అశ్వనీ దేవతలచే నూత్న యౌవనాన్ని పొందిన చ్యవనుడు కృతజ్ఞుడై అశ్వినుల ప్రీతికొరకు యాగం చేసి, ఇంద్రుణ్ణి కూడా జయించి వాళ్ళను దేవతల్లోకి జేర్చి, హవిర్భాగాన్ని అందించటం జరిగిందనే (భారతం) గాథ కూడా ప్రాచీన కాలంలో అశ్వినులతో గూడిన మేషరాశి ప్రజాపతి యొక్క శిరోభాగాన లేదని స్పష్టమౌతుంది. బ్రహ్మనుండి ఉద్భవించిన దక్షుడు, స్వాయంభువు మనువుకూతురైన ప్రసూతి వల్ల 16 మంది కూతుళ్ళను పొంది అందులో ఒకతెయైన సతీదేవిని శివునకు అర్థాంగిగా ఇవ్వటం జరిగింది.

చాక్షుష మన్వంతర సంధిలో ప్రాచీనబర్హి రాజ్యపాలనాకాలంలో దక్షాధ్వరధ్వంసం జరిగింది.(భాగవతం) అప్పుడు ఈ దక్షుని శిరస్సు దగ్ధమై ఆ తర్వాత మేషశిరస్కుడుగా పునరుజ్జీవితుడైనాడు. ఇతడే సర్వదేవతా స్వరూపాలతో పాటు చాక్షుషమన్వంతరంలో రూపాంతరం చెంది, ప్రాచీన బర్హికుమారులైన ప్రాచేతసులకు 'మారిష' అనే వృక్షకన్యయందు రెండవ దక్షుడుగా ఆవిర్భవించాడు. ఇదే ప్రస్తుత ప్రజాపతి (రాశి చక్రము) స్వరూపము, ఈ స్వరూపము ఏర్పడడానికి మహాకాల స్వరూపుడైన శివుడు కారణభూతుడైనాడు. ఇది దక్షాధ్వర ధ్వంస గాథలోని ఖగోళ పరిణామ రహస్యం.

ఇటువంటి సృష్టిపరిణామరహస్యా లెన్నో పురాణగాథలనిండా భూమి మీద జరిగిన సామాన్యకథలుగా, సాంకేతిక రహస్యార్థాలతో వేలకు వేలు రచించబడినయి. వీటికి కర్తలైన మహర్షులు ఎంతటి వైజ్ఞానికవేత్తలో మనం అర్థం జేసుకొంటే వీటిని అభూతకల్పనలుగా, పుక్కిటి పురాణాలుగా ఈ విజ్ఞానానికి వారసులమైన మనం ఎన్నటికి కాదని త్రోసిపుచ్చలేం.

కవిశేఖరుల దివ్యలేఖిని నుండి జాలువారిన ఈ సౌందర్యశలాక సాహిత్యప్రియంభావుకులతోపాటు ఆబాలగోపాలాన్ని అలరిస్తుందనుటలో ఎటువంటి అనుమానం లేదు. శ్రీ రాజేశ్వరరావు గారు చిరకాలం ఇట్లే తమ కవితాతపస్సు కొనసాగిస్తూ-మరికొన్ని కావ్యఫలాలు సహృదయ సాహిత్య లోకానికి అందివ్వగలరని ఆశిస్తున్నాను.

"సరస సాహితీ చరణ చారణ చక్రవర్తి"
**శ్రీ పి.వి.ఎల్.ఎన్. విద్యాసాగర శర్మ**
ప్రిన్సిపాల్
ప్రభుత్వ ప్రవర కళాశాల
మంథని

శ్రీ గణేశాయనమః

# కవితామాకందము

చ. వచన కవిత్వధోరణులు వర్ధిలు నీ సమయంబునందు నీ
రుచిరపదార్థభావసుమరోచుల నొప్పెడు కావ్యవృక్ష స
ప్రచన మొనర్చుచున్నది యథార్థముగా నొకగొప్ప, భిన్నవృ
త్తచయము దేశిఛందములు దారసిలం గ్రథియించు టల్పమే?

క. గంగ తలపైనఁ గల జో
డుం గలుపంబుల నడంపఁ దోయిజ లిడి శ్రీ
గంగారాజేశ్వరు కృతి
నిం గారుణ్యమున నేల నియతిం గొలుతున్.

క. చిరకాల మిత్రుఁడును, కవి,
సరసుఁడు, భక్తుండు, కష్టసంహతులను ని
బ్బరమైన గుండె నోర్చిన
ధరణీసురవరుఁడు, విమలతా శోభితుఁడున్.

క. ఆత్మంభరత మెఱుంగని [illegible]
వాఁడు, క్షమాశీలి, భీష్మబాలిక పెండ్లిన్
నాఁడు వినిపించెఁ జదివితి
నేఁ డీ పార్వతివిజయము నెమ్మన మలరన్.

క. వివిధచ్ఛన్దంబులు తరు
లవితథగణయతులు ప్రాస లవియె యలంకా
రవిలసనంబు రుచిర భా
వవిశద సౌరభము కావ్యవనమున వఱలెన్.

క. గంగారాజేశ్వరుఁ డీ
గంగారాజేశ్వరుని సుఖంబుగఁ గవితా
సంగమున మనిచి యైహిక
సంగం బెడలించి ప్రోవ సాగుత దయతోన్.

విధేయుఁడు
శ్రీ పార్వెళ్ళ గోపాలకృష్ణ
ఆంధ్రోపన్యాసకులు
సాయం కళాశాల కరినగరము

# శుభాభిశంస

'కవి శేఖర'

**శ్రీ చెప్యాల రామకిషన్‌రావు**

(గంగా తరంగిణీ సారస్వత సమితి ప్రారంభోత్సవ సందర్భమున ముఖ్యాతిథులుగా పాల్గొన్న శ్రీ చెప్యాల రామకిషన్‌రావుగారు ఆశువుగా చెప్పిన మంత్రపురీ పద్య గుచ్ఛము)

## మంత్రపురీ పద్యగుచ్ఛము

శా. శ్రీమన్మంత్రపురీ పురాతనధరా సీమంతినీ గౌతమీ
సీమంతోజ్జ్వల మౌక్తికస్ఫుటతట క్షేత్రస్ఫురత్కాశ సు
త్రామావాస సువాసనాద్రు సుమనోరాజన్మహా భూసుర
గ్రామ బ్రాహ్మ్యయశోఽభిరామ సుమహః క్రాంతిన్ విలోకించెదన్.

గీ. మంత్రకూటమా ! ధిషణ సమాన విబుధ
విప్రసురవాటమా ! మోక్ష విపుల సౌధ
మణికవాటమా ! యుపనిషన్మంత్రరవు కు
మతమృగాఖేటమా ! నిన్ను మఱచిపోను

గీ. విమలదర్పణామల తటాకములు నిచట
విశ్వగర్భ గర్భాలయోపేతభూరి
దివ్య దేవాలయముల దీప్తిల్లఁ జేయు
కసులపుష్పమాలాలంకృతముల భంగి

ఉ. ముప్పదిమూఁడు కోట్ల సురపుంజమె నేలకు డిగ్గి వచ్చి యా
యుప్పరవీథినుండి కొలు వుండిరి సుస్థిరులై; పురీజనుల్
పప్పులు, బెల్లముల్, మఱియుఁ బండ్లను, బాలను, భక్తి నీయఁగాఁ
దప్పక నారగించు హరి దత్తుఁడుగాఁడె తనంతఁ దా నిటన్.

తే. అట్టి మంత్రకూట నివాసుఁ డమృతగుణుఁడు
నిద్ధకవిశేఖరుండు రాజేశ్వరుండు
వ్రాసెఁ బార్వతీ విజయ ప్రబంధ మద్ది
వఱలుఁ గావుత! నాచంద్ర భాస్కరముగ!

# నివేదన

'వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతి పత్తయే
జగతఃపితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ'

గంగాతరంగిణీ ప్రచురణములలోఁ బ్రథమ తరంగము రుక్మిణీ కల్యాణము ద్వారా రసజ్ఞులకు నన్ను నేను బరిచయ మొనర్చికొని యుంటిని. కొన్ని కారణాంతరముల వలన ద్వితీయతరంగప్రచురణకు సుదీర్ఘ కాలము పట్టినను దానినిప్పుడు పార్వతీవిజయ రూపమున సర్వాంగసుందరముగ మీ హస్తకమలములం దందఁజేయఁ గల్గినందుల కా పార్వతీపరమేశ్వరుల పాదారవిందముల కనేక విధముల భక్తిప్రణామము లర్పింతును.

రుక్మిణీకల్యాణ ముద్రణసమయమున శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణానంద స్వాముల వారి యనుమతి చొప్పుననే నా రచనల వ్రాతప్రతులును, దన్ముద్రణార్థము 15000 = 00 రూప్యములును శ్రీ రామకృష్ణానందాశ్రమము మంథెన వారి కప్పగించియుంటిని. కాని యా కార్యము వారి కసాధ్య మగుటచేఁగాఁబోలు రుక్మిణీ కల్యాణ ముద్రణ వ్యయము రూ. 3000/-లు పోను మిగిలిన 12000/- ప్రచురణ చేయించుకొనుఁడని నాకే తిరిగి యిచ్చి వేసిరి. ఈ సందర్భమున నా యాశ్రమము వారికి, ముఖ్యముగా స్వాముల వారికిఁ బ్రణామ పూర్వక కృతజ్ఞతలు తెలుపుకొందును వెంటనే యీ కార్యభారము తాము వహించి, ప్రచురణ సాఁగించుచున్న గంగాతరంగిణీ సారస్వత సమితి వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు. ఈ సమయమున నాకు సాయపడిన వారందఱికిని, ముఖ్యముగా శ్రీ కర్ణె పుల్లయ్య, శ్రీ గీట్ల జనార్ధన్ రెడ్డి, శ్రీ మాదాటి ప్రభాకర రెడ్డి, శ్రీ ఇల్లెందుల సత్యనారాయణ, డా॥ శ్రీ శుకశ్రీ గారలకు ప్రత్యేకాభివందనము లందింతును. తక్కిన తరంగముల ప్రచురణ కార్యక్రమము నవ్యవధానముగాఁ గొనసాఁగింప నుమామహేశ్వరులను బునఃపునః బ్రార్థించుచున్నాను.

గతంలో 29 నవంబరు 1984 గురువారమున నా రుక్మిణీకళ్యాణావిష్కరణసందర్భమున సభాధ్యక్షులు శ్రీ జి.వి.ఎల్.ఎన్. విద్యాసాగర శర్మ

గారు, సదస్యుల కరతాళధ్వనుల మధ్యఁ గవిశేఖరయని బిరుదు ప్రసాదించిరి. శ్రీ వేంకటరాజన్న అవధాని గారు 'కవి శ్రేష్ఠ' యనిరి. వారి యభిమానమునకుఁ గృతజ్ఞతలర్పింతును. గంగాతరంగిణీ సారస్వతసమితి వారు 'కవి శేఖర' యనియే ప్రకటించిరి. వారికి హార్దిక కృతజ్ఞతలు.

అవతారికలో సూచించినట్లీ కావ్యము పరమ శివుని యాదేశము మేరకు రచింపఁబడినది. పార్వతీవిజయ నామాంకితము. సతీ వియోగము, గౌరీజననము గిరిజాకల్యాణము నని ఖండత్రయ విభజితము. ప్రథమఖండమున పార్వతి తన పూర్వావతార మగు సతీజన్మము చాలించునపుడు పశుపతినిఁ బతిగాఁ బడయుటకుఁ బ్రతిన సేయుట. ద్వితీయఖండమున నా వాంఛఁ బూర్తి చేసికొనుటకు సమస్త ప్రతికూలముల నెదిర్చి శివుని మెప్పించుటకు ఘోర తపము నాచరించుట, తృతీయఖండమున శంకరుని కఠినపరీక్ష యందుఁ గృతార్థురాలై యతనిఁ బాణిగ్రహణ మొనర్చి విజయము సాధించుట యిందలి కథా వస్తువు. ప్రతిజీవియు దేహత్యాగసమయమున స్థిరపడినకోర్కుల కనుకూలముగ నేర్పడిన వాతావరణములోఁ బునర్జన్మ నంది తద్వాంఛల నీడేర్చి కొనుటకు సహజముగానే యత్నించును. పూర్వజన్మవాంఛా బలిష్ఠతమీఁదనే యా యా వాంఛల సఫలీకృత మాధారపడి యుండును.

ఈ ప్రబంధమును ప్రేమాభిమానములతో జదివి, సవరించి, మార్పులు, చేర్పులుఁ, గూర్పులు మున్నగువానికిఁ దగుసలహాలిచ్చి సర్వాంగ సుందరముగఁ దీర్చి దిద్దుటలో సహాయపడిన శ్రీ గట్టు గణపతిగారికి వందనములు డా॥ శ్రీ శుకశ్రీ, శ్రీ పార్వెళ్ళ గోపాలకృష్ణ గారలకు కృతజ్ఞతలు. సంస్కార యుక్తముగ శుద్ధ ప్రతిని సిద్ధ మొనర్చి స్వీయ పర్య వేక్షణలో ముద్రించి ప్రచురింపజేసి నందులకు డా॥ శుకశ్రీ గారికి ప్రత్యేకాభివందనములు. అడిగినంతన నా కంతటి యర్హత లేకున్నను, నభిమానముతో నామూలాగ్రము పఠించి సముచితమైన పీఠిక వెలయించిన మహాకవులు, పుంభావ సరస్వతులు, ఖండ ఖండాంతరములలో తెలుఁగుఁదీయనము వ్యాప్తి చేయుట కితోధికకృషి సలిపినవారును నగు, కళా ప్రపూర్ణ డా॥ శ్రీ దాశరథి గారికిఁ గృతజ్ఞతాభి వందన పూర్వకముగఁ గైమోడ్పు లర్పింతును.

కోరినంతనే దయతో నా పైనున్న యాదరాభిమానములఁ బురస్కరించు కొని కావ్యమును శ్రద్ధతోఁ బరిశీలించి సమగ్రమైన తమ యమూల్యాభిప్రాయ మొసంగిన 'సరస సాహితీ చరణ చారణ చక్రవర్తి' శ్రీ జి. విద్యాసాగరశర్మ గారి కివే హార్దిక కృతజ్ఞతలు.

పార్వతీ విజయ ముద్రణలోఁ దగు సలహా లొసంగి యన్ని విధముల సహకరించిన ఆచార్య డా॥ శ్రీ దివాకర్ల వేంకటావధాని గారికిఁ గృతజ్ఞత లర్పించుకొనుచున్నాను తమ యభిప్రాయములు వెలయించిన శ్రీ పాల్వోళ్ళ గోపాలకృష్ణ, శ్రీ చెప్యాల రామకిషన్ రావు గారలకు హార్దికాభివందనములు ప్రథమ తరంగ బాధ్యత స్వీకరించిన శ్రీ గట్టు గణపతిగారి వలెనే, ద్వితీయ తరంగాదిక ప్రచురణ బాధ్యత స్వీకరించి, కృషిని కొనసాగించుచున్న డా॥ శ్రీ జకశ్రీ గారికి నేనెంతో ఋణపడియున్నాను. వారి కా శివపార్వతు లాయు రారోగ్యాఖండ సౌభాగ్యము లిచ్చి రక్షింత్రు గాక. ఇంకను ప్రత్యక్షముగను, పరోక్షముగను, సహకరించినవారికిని, సర్వాంగసుందరముగ సకాలమున ముద్రించి యిచ్చిన భాను ప్రింటర్స్ వారికిని హార్దికాభి వందనములు.

ఈ గ్రంథముద్రణకుఁ దగువిధమున నార్థికసహాయ మందించిన శ్రీమత్తిరుమలతిరుపతి దేవస్థానము వారికిఁద్రికరణశుద్ధిగఁ గృతజ్ఞతాపూర్వక నమోవాకము లర్పింతును.

ఇందలి యుక్తాయుక్తములకు రసజ్ఞులే ప్రమాణము.
ఇఁకఁ బార్వతీవిజయమును బ్రదర్శింతును.

ఇట్లు
సర్వసత్కవిశేఖర విధేయవర
కవిశేఖర
గంగా రాజేశ్వరరావు

ఓం

శ్రీ గణేశాయ నమః

శ్రీ సరస్వత్యై నమః

ఓం నమశ్శివాయ

# పార్వతీ విజయము

## ప్రథమ ఖండము

## స తీ వి యో గ ము

### ఇష్టదేవతా ప్రార్థన

శ్రీవిఘ్నేశ! గణాధినాథ! వరదా! సిద్ధిప్రదా! పార్వతీ
దేవీపుత్ర! దయాసముద్ర! భగవన్! దీనావనా! పావనా!
సేవింతున్ సతతంబుఁ ద్వచ్చరణముల్ శీఘ్రంబుగాఁ బూరితిన్
గావింపం దగు నాదు కావ్యరచనా కార్యం బవిఘ్నంబుగన్ 1

ఉ. ఏణవిలోల నేత్ర! భువనేశ్వరి! భారతి! శారదాంబ! నిన్
క్షోణితలంబునం దెవరు స్తోత్రము చేయ సమర్థులో జగ
త్త్రాణ! మదీయ జిహ్వను సుధాప్లుత వాక్యము లొల్కునట్లు హృ
ద్వీణను మీటుమా, భ్రమరవేణిరో! వాణిరో! బ్రహ్మరాణిరో! 2

శా. తుల్యం బెయ్యది నీకు? నీ మహిమ సంస్తుత్యం బుమానాథ! సా
కల్యం బైన విశుద్ధ భక్తియు, విరాగత్వంబునుం జిత్త నై
ర్మల్యంబుం బరిపూర్ణ భూతదయ, నిర్మానంబు, నిర్మోహమున్
గల్యాణంబును గూర్చుచుండుఁ గద, నీ కల్యాణ గాథా సుధల్ తె

శా. అంభోజాక్షి! త్రిలోకసాక్షి! జగతీ వ్యాపార పారీణ! నిన్
సంభావింతు రజాది దేవగణముల్, సౌభాగ్య సంప్రాప్తికై
శంభుండున్ నినుఁ గూర్చి చేసె తపముల్, సర్వస్వరూపా! యనా
రంభంబుల్ గద, నీకృపార రహిత ప్రారంభంబు లారంభముల్. 4

క. శ్రీ రాజేశ్వర! నిను నే నే రీతి భజింతు? మంత్ర మే యది? పారా
వారంబు సుమ్మ! యీ సంసారంబు, తరించు మార్గన రణింజెపుమా!

ఉ. ఈశ్వరి యర్థమందు, సురకేశ్వరి మూర్ధము నందు నుండి, ప్రా
ణేశ్వర! నేను నే ననుచు నీర్ష్యమెయిం గలహింతు రంచు, వి
శ్వేశ్వరుఁ డేలలేఁ డన హసింతురు, సాఁకులు చెప్పఁ బోకు రా
జేశ్వర! మత్కృతిన్ సతిగ స్వీకృతి సేసి యను గ్రహింపుమా! 5

తే. పరమశివ! భక్తమందార! పార్వతీశ!
నా కృతిని, పార్వతిని నిత్తు నీకుఁ గొమ్ము
నీ కృతిని పార్వతీస్థితి నాకు నిమ్మ.
వెల నొసంగియ కొంటివి ఫలము సుమ్మ! 6

తే. అవని వేద పురాణేతిహాస కర్త
బ్రహ్మ సూత్రప్రదాత, పరాశరాత్మ
జుండు, వ్యాసుండు ద్వైపాయనుండు ఘనుఁడు
బాదరాయణికి సహస్ర వందనములు 7

క. వల్మీకంబునఁ బుట్టిన
వాల్మీక మహర్షి వ్రాసె రరామ థన్
దాల్మిని నతనిం గొల్చెద
వల్మీకము లెఱుఁగు మధుర వస్తువు జాడల్ 8

తే. కాళిదాసును గొల్తు శృంగార కవిని
భారవిని, మాఘు, బాణభట్టారుఁ దలఁతు
పాణినికి, వరరుచికిని, భాష్యకారుఁ
డౌ పతంజలికి ఘటింతు నంజలులను 9

ఉ. నన్నయ శబ్దశాసను వినమ్రుఁడనై ప్రణుతింతు, మంత్రి తి
క్కన్నకు సోమయాజికి, ననంత నమస్కృతు లాచరింతు, నె
ఱ్ఱన్నకు శంభుదాసునకు హార్దిక భక్తిని మ్రొక్కి భక్తపో
తన్నకు వందనంబులు శతంబు లొనర్తును గావ్యసిద్ధికై 10

సీ.మా. రామాయణము వ్రాసి రంజింపఁ జేసిన
భాస్కర కవులకు వందనములు
సోమనాథు మిగుల స్తుతి సేతుఁ బాల్కురి్కి
సోమనాథుని, నన్నెచోడుఁ గొల్తుఁ
గవి సార్వభౌము శృంగారనైషధ కర్త
శ్రీనాథుకవిను జేజే లొనర్తు
మనుచరిత్ర విధాత, మహనీయుఁడు, కవి పి
తామహుం డైన పెద్దనను గొల్తుఁ
పారిజాతసుమ సువాసనల్ వెదచల్లు
ముక్కుతిమ్మ నార్యు మ్రొక్కెద మది
పాండురంగ మహిమఁ బ్రకటించిన తెనాలి
రామకృష్ణ సుకవి రాజుఁ దలఁతు
విష్ణు చిత్తీయంబు వెలయించు శ్రీకృష్ణ
దేవరాయలను గీర్తింతు మిగుల
వసుచరిత్ర రచించి వాసి కెక్కిన రా
రాజభూషణునకుఁ బ్రణతు లి...

తే. పూర్వ కవిపుంగవులకుఁ గేల్మోడ్చి, పిదప
మధ్యయుగ కవివరుల నమస్కరించి
యాధునిక కవితిలకుల నాదరించి
భావ కవిశేఖరులకును బ్రణుతి సేతు 11

తే. భార్య కున్మాద జాడ్యంబు వట్టుకొనియె
నౌషధంబుల సేవయు వ్యర్థ మయ్యె
మానసికరుజ న న్నాక్రమణ మొనర్చె
నిరయముగ మారె సంసార నిలయ మంత 12

తే. శైవ పంచాక్షరియ నాకు శరణ మయ్యె
నైనఁ జిత్తంబు శాంతింప దట్టి వ్యథలఁ
బట్టి పీడించు చుండ నా బాధ లింక
నోపఁ జాలక శివు వేఁడు చుంటి నిటుల 13

ఉ. ఘోరపిశాచముల్ ముసురుకొన్నవి చుట్టు భయంకరంబుగన్
గోఱలు సాఁచి, గ్రుడ్లుతిమి క్రూరవిదృష్టిని, రక్తదాహమున్
గోరుచుఁ జూచుచున్నవి, యఘోర! దయానిధి! నీదు ప్రాపునం
జేరితి; రక్షణం గలుగఁ జేయర! శత్రుభయంకరా! హరా! 14

విజయ రూప తురగ వల్గన

నాగభూషణా! సురేశ! నందివాహనా! గిరీశ!
త్యాగరూప! ధూతపాప! దక్షయజ్ఞనాశ! యీశ!
భోగభాగ్యదాత! పంచ భూతసేవితా శుభాంగ!
రాగదోషభంగ! గంగరాజపోష! రాజలింగ! 15

పంచ చామరము

భవానినాథ! విశ్వనాథ! భక్తవత్సలా! హరా!
భవాబ్ధిపోత! మోక్షదాత! పార్వతీమనోహరా!
దివాకరాగ్నిసోమనేత్ర! దీనరక్ష! శంకరా!
శివా! యుమామహేశ! శంభు! చిన్మయా! శుభంకరా! 16

క. నిత్యనిరంజన ! నిర్గుణ !
సత్యవ్రత ! స్ఫటికవర్ణ ! సాంబ ! దయార్ద్రే !
కాత్యాయనీమనోహర !
మృత్యుంజయ ! నన్నుఁగావు, మృగధర ! కృపతోన్ 17

క. శశిధరమకుట ! దిగంబర !
పశుపతి ! రజతాద్రివాస ! పాశుపతాస్త్రా !
యశనవిషా ! శూలి ! యహ
ర్నిశలును నినుఁ గొల్తు; బ్రోవు నీలగళ ! ప్రభో ! 18

తే. త్రిణయనా ! కాలనాశక ! త్రిపురహరణ !
దేవదేవేశ ! శ్రీమహాదేవ ! శంభు !
వరద ! నా మొఱ లాలింపు వామదేవ !
కృపను జూడవ దేలర ! కృత్తివాస ! 19

తోటకము. శరణాగతవత్సల ! సాంబశివా !
స్మరియింతు సదా ని నుమారమణా !
భరియింప నశక్యపు బాధలురా !
కరుణాకర ! ప్రోవర ! కామహరా !

సుగంధి. నిన్ను నమ్మినాను స్వామి ! నీవె నాకు దిక్కు; నీ
కన్న వేఱ దైవ మొండు గానరాదె యుర్వి; నా
పన్నరక్షకా ! వృషాంక ! పాహి ! యచ్యుతప్రియా !
కన్నతండ్రి ! నీదుబిడ్డఁ గానవా ! సదాశివా ! 21

వ. ఇట్లు నిరంతరము ప్రార్థించు చుండు నంత 22

ఉ. సాంబుఁడు మన్మనంబునఁ బ్రసన్నముఖంబునఁ దోఁచి మందహా
సంబున నన్నుఁ జూచుచును, శాంభవి సత్కృప, నీ మనోవిచా
రంబు దొలంగుఁ దచ్చరిత వ్రాయు మటన్నను, నస్మదీయ భా
గ్యం బని పార్వతీవిజయగాథ రచింతుఁ బ్రబంధశైలిలోన్ 23

వ. అని నిశ్చయించి యది పరమేశ్వర ప్రసాదంబుగను, సకల
భక్తజనానందంబుగను దలంచి యిట్లు; 24

క. శంకరునకు సృష్టిప్రళ
యంకరునకు సాధుజనభయంకర, భవనా
శంకరునకు, భక్తావన
కంకణునకు, దక్షకృతమఖ ధ్వంసునకున్ 25

క. శూలికిఁ గపాల మాలికి,
నీలగళునకున్ సుతీక్ష్ణ నిటలాక్షునకున్
గాలాంత జ్వాలాయుత
హాలాహల భక్షణునకు నహిభూషునకున్ 26

క. హారికిఁ, ద్రిపురాసురసం
హారికి, గౌరీమనోవిహారికిని, విషా
హారికి, శ్మశానభూసం
చారికి మారారికిన్ విషధరధరునకున్ 27

క. హరునకు గిరితనయ మనో
హరునకు, నజ్ఞానతిమిరహరునకు, గంగా
ధరునకుఁ జంద్రధరునకున్
గిరీశునకు, గిరిశునకును, గిరిజేశునకున్ 18

క. శివునకు, భవునకుఁ, గమలో
ద్భవ దేవేంద్రాది దివిజ వంద్యునకున్, మా
ధవ భక్తాగ్రేసరునకు
భవబంధ విమోచనునకుఁ బరమేశునకున్ 19

క. శంభునకు, దిగంబరునకుఁ
త్ర్యంబకునకు, సాంబునకు, దయాంభోనిధికిన్
లంబోదర జనకునకు
న్నంబా వల్లభునకున్ మహాదేవునకున్ 20

వ. సమర్పణంబుగా నాచే రచియింపంబడు పార్వతీ విజయం బను
కావ్యంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన 21

## దక్ష యాగము

### స్రగ్ధర

శ్రీ కల్యాణ ప్రదాతా! శ్రితహితకర! గౌరీ సతీ ప్రాణనాథా!
శ్రీకంఠా! కృత్తివాసా! స్మితముఖ! సురసంసే వితాంఘ్రి ప్రకాశా!
యో కారుణ్యాంబు రాశీ! యురగపతివిభూషోజ్జ్వలాంగాత్మలింగా!
నీకై మ్రొక్కులు ఘటింతున్ నిటలనయన! సందీప్త చంద్రార్ధమౌళీ!

### -నైమిశారణ్య వర్ణనము-

సీ.మా. అశ్వత్థ వట పలాశౌదుంబర ప్లక్ష
బిల్వ మధూక కపిత్థములును
శ్రీపర్ణ నింబ హరీతకీ బదరీ క
దంబ దాడిమ దేవదారువులును
సాల రసాల హింతాల తాల తమాల
తక్కోల ఘనదేవతాలములును
నారికేళ శివా పనస జంబు జంబీర
ఖర్జూర పూగ ద్రాక్షాకదళులు
పారిజాత లవంగ పాటల కాంచన
శ్రీచందనాశోక శింశపములు

మాలతీ చంపక మల్లికా పున్నాగ
బంధూక కరవీర వకుళములును
శార్దూల గజ ఖడ్గ శరభ పంచానన
భల్లూక వృక శివా వానరములు
శుక శారిక మయూర పిక సారస కపోత
క్రౌంచ హంస బక కారండములు

తే. ఝష మకర కచ్ఛప సలిల చరములకును
షట్పదాశ్రిత సుందర సరసిజాళి
కాస్పదం బైన నైక జలాశయములు
గల్గి వెల్గొందు నైమిషకాననంబు. 23

వ. అట్టి పుణ్య వనంబున శౌనకాది మహర్షులు సహస్ర వర్ష సత్ర యాగ పురస్సరంబుగ సంధ్యోపాసనాది నిత్యకర్మలు నిర్వర్తించి భగవత్కథాశ్రవణ కుతూహల మతులై మహాపౌరాణికుం డైన సూతునిఁ గూర్చి

ఉ. పార్వతి పూర్వజన్మమున బ్రహ్మతనూజుతనూజ, యాద్యుఁ డౌ
శరువని ప్రేమపాత్ర, సతి, సాధ్వి, యశస్సు విశాల, యేలకో
దురివిధి దక్షయాగమున దుఃఖము నోపక దగ్ధమయ్యె నా
గరివయు దక్షుఁ డెట్టిగతి గాంచెను ! చెప్పవె విస్తరంబుగన్ 25

క. అని యడిగిన శౌనకులకు
ఘనముని సూతుండు వల్కె గంభీరోక్తిన్
వినుఁ డీక శ్రద్ధాభక్తిని
వినిపించెద దక్షయాగ వృత్తాంతంబున్ 26

క. హరపార్వతుల చరిత్రలు
దురితఘ్నంబులును దుఃఖదూరీకృతముల్
పరమసుఖ ప్రాప్తంబులు
నిరుపమ కల్యాణములకు నెలవులు సుండీ ! 27

-కైలాసపుర వర్ణనము-

సీ. హిమభూధరాధిపు నీశత్వముం జాటు
మణిరచిత రజిత మకుట మనఁగ
శైలేంద్రుఁ డను నాకసంబున సుస్థావి
తమగు శరజ్జలధర మనంగ
నగరాజ మను తూర్పునగముపైఁ బొడమెడు
సంపూర్ణకళలను జంద్రుఁ డనఁగ
పర్వతేశుని యింటిపై బ్రావాలు బ్రహ్మ వా
హన మైన యా రాజహంస యనఁగ

తే. వెలుఁగు కైలాసపర్వత నిలయ మందు
ప్రమథ గణములు గొల్వ భద్రంబుగాను
దేవతలు సేవ లొనరింపఁ దేజరిలుచు
సృష్టి పరిపాలనము చేయు శివుఁడు భవుఁడు. 28

వ. అట్టి కైలాసావాసం బెట్టి దనిన 29

సీ. సూర్యచంద్రు లచటఁ జొరలేరు చొచ్చినఁ
దేజోవిహీనులై తిరుగవలయు
చీఁకటు లచ్చోటఁ జేరంగ నేరవు
చేరి చేరకయ నశించి పోవు
సామాన్యులకు నట స్థానమ్ము లే దిఁక
స్థాన మేర్పడిన శాశ్వత మగు నది
దోసంబు లచ్చట దొరలవు, దొరలిన
వారలు దుర్గతి పా లగుదురు

తే, దుఃఖములు కావలయు నన్న దొరక వచట
ముసలితన మెట్టిదో దాని మో మెఱుఁగరు
శాంతిరసమున సర్వరసము లడంగు
నదులు లీనంబు గావె వననిధియందు 30

వ. అప్సరమసుధావాసంబైన కైలాసంబున సతీశంకరులు నిండు
కొలు వైన వైన మెట్టిదనిన 31

సీ. లోహితకేశాల లోఁతు గ్రహించే వి
నీలకుంతలములు మేల మాడ
ఫాలలోచనుని నిమీలిత నేత్రాలు
కమలాక్షికనులతోఁ గలసి యాడఁ
దెల్లని దేహంపుఁ దేజమ్ము నెదిరించి
పసిఁడి దేహపుఁ గాంతి పందెమాడ
ఫణిభూషణాంచిత మణిగతరోచులు
మణిభూషరుచులతో మాటలాడ

తే. దాఁగి మౌనము చాటున దరహసనము
పొలఁతి చిఱునవ్వుతోడ దోబూఁచులాడ
సతిని వామాంకమునఁ గొన్న శంభునిఁ గని
శారదాభ్రతటిల్లతల్ సరసమాడ 32

తే. నంది స్కంధంబు సింహాసనముగఁ దనర
భృంగించడులు చామరల్ వేయుచుండ
ఫణికులేంద్రుఁడు ఛత్రమై పరిఢవిల్ల
నిండుపేరోలఁగంబున నుండె హరుఁడు 33

ఉ. దక్షిణపార్శ్వపీఠములఁ దామరసాక్షుఁడు పార్షదుల్ సహ
స్రాక్షుఁడు, నగ్నిముఖ్యులు, దిశాధిపతుల్ సురవర్యు లుండ, ఫా
లాక్షునివామ మందుఁ గమలాసనుఁడాది ప్రజాపతుల్ ద్విజా
ధ్యక్షులు, బ్రాహ్మరూపసనకాదులు, బ్రహ్మమునీంద్రులుండఁగన్

క. వేడిరి సిద్ధులు సాధ్యులు
పాడిరి గంధర్వవరులు వాద్య ములపైఁ
జేడియ లచ్చరకన్నెలు
నాడిరి, మోదాబ్ధి నోలలాడిరి సభికుల్ 35

వ. అట్టి జగన్నియంత సన్నిధానంబున, జగన్నిర్వాహకు లగు దేవేశులుఁ దమతమ విధినిర్వహణంబుల నెఱిగించువిధం బెట్టి దనిన 36

సీ. అజుఁడు వాకొనె పురహర ! నే సృజింతును
జగములు మీఁదు శాసనము మేరఁ
బద్మనాభుఁడు వల్కె, స్వామి మీ యానతి
సకలసృష్టికిని రక్షణముఁ గూర్తు
నింద్రుఁడు దెల్పె విశ్వేశ ! త్రిలోకపా
లన దమయాజ్ఞచేతను ఘటింతు
పావకుండు సెప్పెఁ బ్రభు ! మీ యనుమతిని
బ్రజ్వరిల్లుచునుందు వసుధయందు

తే. పవనుఁడును బ్రకటించె మీ బలమువలన
వీఁచు చుందును నే నెల్లవేళలందు
యముఁడు దా విన్నవించె మీ యానవట్టి
దండ్యులను నేను దండింతుఁ దగువిధ మన 37

కం. సాంబుఁడు మౌనము దాల్చి మ
నోఽంబుజగతుఁ డై యవాఙ్మనోగోచరత
త్త్వంబును జీవబ్రహ్మైక్యంబును జిన్ముద్రఁ
దాల్చి కరమునఁ దెల్పెన్ 38

శా. బ్రహ్మేంద్రాదులు, దేవతాగణములున్, భక్తుల్, మునుల్, సిద్ధులున్
బ్రహ్మర్షుల్, సనకాదులున్, సకలదేవర్షుల్ ద్విజశ్రేష్ఠులున్
బ్రహ్మంబే బహిరంతరంబులను వ్యాప్తం బంచు నీక్షించుచున్
బ్రహ్మానందసరస్సులో మునుఁగుచున్ బాహ్యస్మృతుల్ వాయుచున్

వ. ఉన్న నట్టి సభను గుఱించి ప్రజాపత్యధ్యక్షుం డైన దక్షుం డేతెంచు మార్గం బెట్టి దన. 40

## దక్షకృత శివాపరాధము

సీ. విప్రు లొనర్చెడు వేదఘోషలు దశ
 దిక్కులం దెల్లెడఁ బిక్కటిలఁగ
ఛత్రచామరములు చైతన్యయుతములై
 చేరి సపర్యలు చేయు చుండ
ధౌతవసనయుగ్మధారి హస్తములందు
 స్రుక్స్రువదర్భలు సొంపు మీఱ
యజ్ఞోపవీతమ్ము లమరఁ ద్రేతాగ్నులై
 బ్రహ్మవర్చ స్సుట్టిపడ మొగమున

తే. నక్షమాలిక లురమున నాడ వెలి వి
భూతిపుండ్రంబు లతని విభూతిఁ దెల్పఁ
బాదుకాయుగ్మమున నొప్పఁ బాదయుగము
సోమశేఖరుఁ గన నేఁగె సోమయాజి 41

### క్రౌంచపదరూప హరిగతి రగడ

వచ్చెను దక్షాధ్వర్యుఁడు వెంటన్
 వరమునిగణములు వరుసఁగఁ గొల్వన్
జొచ్చెను శైవాంతఃపురమందున్
 సురలవనిసురులు సొరిదిగ నిల్వన్
మెచ్చుచు విప్రాధ్యక్షు నిరాకన్
 మృదులపవనములు మితము జెలగిన్
నచ్చెరు వొందెన్ హర్షముఁ జెందెన్
 నసదృశసభ నతఁ డపుడు గనంగన్ 42

క. దిగ్గున లేచిరి సభికులు
ముగ్గురు బ్రహ్మహరిహరులుముఖ్యులు దక్కన్
భగ్గున మండెను దక్షుం
డగ్గల మగుకోపమునకు నాకృతి యగుచున్ 43

క. పెరిగెను క్రోధము మోహము
తఱిఁగె వివేకస్మృతులును దత్క్షణమందే
కరిఁగెను శాంతిక్షమలును
బరవశుఁడై యీ విధమునఁ బలుకం దొడఁగెన్ 44

ఆ. తండ్రి యజుఁడు నతనితండ్రి విష్ణువు తాత
లేవ కున్న నేమి లేదు దొసఁగు
మామను నన్నుఁ బితృసమానుని గని యింక
లేవఁ డేమి శివుఁడు లేకివాఁడు. 45

ఆ. ప్రీతి లేదు లోకరీతి నెఱుంగఁడు
పాపభీతి నైనఁ బ్రణతు లిడఁడు
యిడకపోని, మామ! యిటు రం డనఁడు వీఁడు
మాట వరుసకే నమానుషుండు. 46

ఆ. కన్నుఁ దెఱచి కనఁడు కనుసన్న నేనియు
నాదరింపఁ డితఁ డనార్యుఁడు సుమ!
యింతగర్వమేల? యేమి పోఁగాలమొ!
బింక మడఁతు నింక బొంకు గాదు. 47

ఉ. దేవుఁడు గాఁడు వీఁడు సరి, దేవుఁడ నంచన కాక నే మహా
దేవుఁడ నంచుఁ జే రరువు దెచ్చి కొనె న్నిది వచ్చిమోసమౌ
భావిని వీఁడు దేవుఁ డని పల్కుట నేరము, హవ్యభాగముల్
లే విక, వీనిపూజ విఫలీకృత మయ్యెడు నాదు నానతిన్ 48

సీ.మా. వీనిఁ గొల్చెడువారు వేదబాహ్యులు, క్రూర
హృదయులు, గృపణులు, హీనమతులు
మోక్షదూరులును విమోహితచిత్తులు
జ్ఞానశూన్యులునై జగాన నుంద్రు

క్రోఁతి మొగము లైదు, కొండెంగచూపులు,
        చేతులుపది వెఱ్ఱిచేఁత లెపుడు
మూఁతకనులు మూఁడు ముక్కాలిముదుసలి
        కట్టుఁదోళ్ళు వల్లకాఁడు కొంప
ప్రేతలు చుట్టాలు ప్రియము బొక్కలపేర్లు
        దయ్యములకు ఱేఁడు దాల్చు బూది
ముసలియె ద్దెక్కను భూషలు సర్పాలు
        పుట్టయందున మెక్కు బువ్వవిసము
శివుఁ డను బిరుదముఁ జేకొనెఁ గాని య
        శివుఁ డమంగళుఁడు నస్పృశుఁడు వీఁడు
నంటరాని యితని కందాల నా ముద్దు
        కూఁతురు నిచ్చితిఁ గులము చెడితి

తే. నారదుని దుష్టబోధలు నమ్మి యిట్టి
చేయరా నట్టి దుష్క్రియ చేసి, పాప
పంకిలంబునఁ దిగఁబడి బాధపడుదు
మోహజాలవివశులు సంబుద్ధులు నిల 49

వ. మఱియు సభాసదుల నుద్దేశించి శపథపూర్వకంబుగ నిటుల నుడువఁ దొడంగె. 50

క. చేసెద నరుద్రయాగము
దోసము లవభృతమువలన దూరీకృతముల్
సేసెద; శైవ మరూపము
సేసెద; పంతంబు నిజము చేసెద; వినుఁడీ. 51

క. ఆహ్వానము మీ కిదె సుఁడీ !
బహ్వాదరకృతములగు సపర్యలఁ గొని, మీ
జిహ్వల యరుచులఁ బాయుఁడి
వహ్వా! యను నట్లు జరుపఁగలయును మఖమున్ 52

వ. అన విని నందీశ్వరుం డీశ్వరనిందానల దందహ్యమానమానసుం
డై కన్నుల నిప్పులు గ్రక్కుచుఁ, గాళ్ళఁ భూమిదద్దరిల్లఁ
ద్రొక్కుచుఁ బండ్లు పటపట నొక్కుచు రౌద్రుండై 53

శా. దుర్మార్గా! దురితాత్మ! దుష్టచరితా! దుర్వృత్తిపారీణ! స
త్కర్మభ్రష్ట! వినష్టబుద్ధి! దురహంకారాంధకారావృతా!
ధర్మాధర్మవిచారశూన్య! పశువా! దర్పంబులం బ్రేలెదా
దుర్మేధాప్రతిమాననారకములన్ దుఃఖార్తులం గుందుమా! 54

ఉ. అంధులు గ్రుడ్డిలోక మని యంతన గ్రుడ్డిది యయ్యెనా? జగ
ద్బంధువు చీఁకటి ల్లని దివాంధమువల్కిన సత్యమా? దయా
సింధువు, దీనబంధువును, జిష్ణను, జిష్ణుఖుఁ, జిద్విలాసు, గ
ర్వాంధుఁడు నిందచేసియు నిరాకృతి సేసినఁ జెల్లనేర్చునే? 55

వ. అని దూఱుచు వెండియు నిట్లు శపింపఁ దొడంగె 56

సీ. ధూర్జటి దూషించి దోషియై దక్షుండు
మేషశిరుండయి మెలఁగుఁ గాక!
దోసినిఁ జూచుచు మీసంబులను మెలి
వేసిన భృగుముని పేఁడి యగుత!
దోసినిఁ గనుచు సెబాసని భగుఁ డెడ
వేసిన కన్నులు పెరుకఁ బడెడు!
దూసెన విని పరిహాసాన నవ్విన
పూషుని పండ్లూడి పోసి యగుత!

తే. కర్మచక్రంబులోఁ దిరుగాడు చెపుడు
జ్ఞానహీనులు మోక్షవిగర్హితులయి
వేదవిక్రయజీవులై, భిక్షుకులయి
యష్ట లయ్యెడు ద్విజులు పెద్దక్కదయకు. 57

వ. అన విని రోషకషాయితాక్షుండై, సర్వాధ్వక్షుం డైన దక్షుండు శైవుల నుద్దేశించి ప్రతిశాపంబుగా ని ట్లనియె 58

ఉ. భండులు, వేదశాస్త్రకువివాదవితండులు, కామభోగపా
ఖండులు దంభవేషులును గాంచనకామినులన్ వరించు పా
షండులు, దగ్ధబుద్ధులును, షండులు, దండ్యులు, మద్యమత్త వే
దండులు మీరు ఘోరయమదండన పొందుఁడి, ! వామమార్గులై 59

వ. అని యచ్చోట నిల్వ నొల్లక 60

క. వచ్చిన మార్గము పట్టెను
హెచ్చరికలు చేయుచుండ నిష్టజనంబుల్
పెచ్చు పెరిగె మచ్చరమును
హెచ్చెఁ బ్రతీకారవాంఛ లీర్ష్యకుఁ దోడై. 61

సరసిజ వృత్త రూప హరిగతి రగడ

సాంబుఁడు లేచె న్నంబను జూచెను సభికుల కొలు విఁక సరి
యని వదలెన్
నంబుజనేత్రుం డంబుదగాత్రుం డజహరులకు సెల వనుచున్
గదలెన్
శంభుని భక్తుల్ దంభవిరక్తుల్ సకల సురమునులు చని రిటు
లనుచున్
గుంభినియందున్ సంభవ మొందున్ గుజనుల భయములు గురుఁ
డీక మనుచున్

-సతీశంకరుల వనవిహారము-

వ. ఇట్లు దక్షుండు నిరీశ్వరం బగు జన్నంబు నారంభింప నుద్యుక్తుండై యున్న యవసరంబున, సతీశంకరులుఁ గైలాసవాటికఁ బూఁదోట యందు విహరింపుచుఁ జలుపు సల్లాపం బెట్టి దనిన 63

### సంవాద సీసమాలిక

మేఘుని కందని మెఱపు సోయగములు
కనులపండువుగను కనుము గనుము
మెఱపును వెన్నంటు మేఘగంభీరోక్తి
వీనులవిందుగా వినుము వినుము
మేఘుఁడు మెచ్చు నెమిళ్ళనాట్యపుఁగళఁ
గనులపండువుగను గనుము కనుము
జలదముఁ సహనృత్యములకుఁ బిల్చెడు కేక
వీనులవిందుగా వినుము వినుము
కోకిలపతియొడిం గూర్చుండెడి సొగసు
కనులపండువుగను గనుము కనుము
కిలకిలఁ బ్రియకుఁ గోకిల పాడు పాటల
వీనులవిందుగా వినుము వినుము
కీరము తనపతిం జేరెడు మర్మము
కనులపండువుగను గనుము కనుము
చిలుకమగని తేనె లొలికెడి పలుకులు
వీనులవిందుగా వినుము వినుము

ఆ. సుమసతీయధరపుసుధఁ గ్రోలు భ్రమరముఁ
గనులపండువుగను గనుము కనుము
ఆ రసంబు ద్రావి యాలపించెడు గీతి
వీనులకును విందు వినుము వినుము. 64

తే. ఈ విధమున సతీపరమేశ్వరు లట
చంద్రికాచంద్రులకుఁ గల సామ్య మరసి
లీల లందును మునుఁగుచుఁ దేలు నవస
రమునఁ బ్రకృతి హలాద్వికారంబు గాంచె. 65

తే. గాలి వీచెను మేఘముల్ గదలిపోయెఁ
దొట్రుపడుచును గేకియుఁ దోఁక ముడిచె
నయ్యయో! డేఁగకోకిల నందుకొనియె
వేఁటకాఁ డదె చిలుకను వ్రేసె వింట 66

తే. పుష్పమును ద్రుంపుకొనె నొక్క పూవుఁబోఁడి
భగ్నమయ్యెను ప్రేమసంబంధ మకట!
యనుచుఁ జింతించు ముకుళితాబ్జాననఁ గని
లోకరీతిఁ దలఁచి త్రిలోచనుండు 67

ఆ. ప్రాఁకు ముంద దౌనొ ?తప్పెల ముం దౌనొ ?
వట్టి భ్రాంతి యీ ప్రపంచ మంత
నీకు నాకు నెడము నేఁడొ రేపొ! యట్లు
సంభవించుటయును సంభవంబ! 68

వ. అన విని యదరిపడి భయవిహ్వల యై భర్తను డాసి 69

క. విశ్లేషము సూచించెడు
నశ్లీలంబులకు సుదతి యడలుచు నుండన్
సుశ్లోకుఁడు దల నిమురుచు
నాశ్లేషించుచును నామె కభయముఁ గూర్చెన్ 70

వ. అంత దంపతు లంతఃపురంబుఁ బ్రవేశించి సుఖం బున్నంత.

శా. శంభో! శంకర! పాహిపాహి! యనుచున్ సద్భక్తితోఁ బాడుచున్
నంభోజాసనసూనుఁ దచ్చటకుఁ రా నర్ఘ్యాదిపూజావిధిన్
సంభావించి రనాదిదంపతులు సన్మౌనీంద్రుఁడుం బ్రీతుఁ డై
సంభాషించె జనాంతికంబుగను నా సర్వేశు దేవేరితోన్ 72

ఉ. ఇట్టులు గోప్యముం బలికి యేమొ మహత్తరకార్య మున్న ద
న్నట్టులు దేని కైన బదు లాడక దేవుని మాటలన్ జెవిం
బెట్టక, సాంబ,సాంబ యని వీణియ మీటుచు నంతరిక్షముం
బట్టి చనెన్, మహామహులభావము గాంచ నసాధ్య మేరికిన్ 73

వ. అప్పుడు సర్వజ్ఞుండైన మహాదేవుండు తనలో నిట్లనియె 74

ఆ. కాఁగలపని కొఱకుఁ గావలసినయట్టిబీజములను నాఁటి వెడలె మౌని
కాలగతినిబట్టి కార్యమ్ముసాఁగునుదరమె బ్రహ్మకైన దానిఁద్రోయ.

వ. అంత దక్షతనయ తనజనకుండు గావించు యజనముం గనఁ
జనుచున్న దేవతాదంపతులఁ గని యతి కుతూహలమతియై తన
పతితో నిట్లనియె. 76

క. ప్రియభక్తాభయ ! మృత్యుం
జయ ! భవభయదూర ! నీకు జయమగుత ! దయా
మయ ! యదిగో చూడుము, ద
క్షయజ్ఞముం గాంచ కొఱకుఁ జను దంపతులన్ 77

సీ. శ్రీనాథుఁ డల్లదే శ్రీదేవిసహితుఁడై
గరుడవాహనముపైఁ గదలె నటకు,
బ్రహ్మదేవుం డదే భారతీయుక్తుఁ డై
హంసవాహనముపై నరిగె నటకు;
దేవేంద్రుఁ డదె శచీదేవినిఁ గూడి, చౌ
దంతివాహనముపైఁ దరలె నటకు
దిక్పతు లదె తమదేవేరులం గూడి
చదలుఁ ద్రోవను బట్టి చనిరి యటకు

తే. నాకునున్ వేడ్క గల్గె నా నాథుతోడ
వృషభరాడ్వాహనంబుపై వెడలుటకును
శీఘ్రమున లెండు నన్నుఁ గొని చేరఁ బొందు
ముదము సమకూర, సంతస మదియు మీకుఁ 78

క. దాక్షాయణి యిటు వల్కుచు
దక్షాధ్వరమంటపానఁ దా నున్నట్లే
వీక్షించె, మరుక్షణమునఁ
బక్షంబులఁ బూని యచట వ్రాలఁ దలంచెన్ 79

వ. ఇట్లు కుతూహలపడు సతిని లాలనగాఁ గాంచి శివుండు . 80

ఉ. నచ్చదు నాదువాసనయు నాయనకున్, మలమక్షికంబుకున్
నచ్చదు సర్పివాసన, జనస్తుతపుష్పసుగంధగంధముల్
నచ్చదు గ్రామసూకరము, నాణ్యములౌ మధురాజ్యభోజ్యముల్
నచ్చవు పైత్యరోగి, కిది నైజము, నీ భ్రమ మానుమా ! యనన్

తే. అత్తమామల విద్వేష మల్లునిపయిఁ
దల్లిదండ్రుల కోపంబు తనయునిపయి
దంపతులమధ్య జగడ మద్దంబుపయిని
పెరుగింజ నిలిచినయంత వేళ, యనఁగ 82

ఉ. ముద్దులు గొన్న దీప మది మూఁతిని గాల్పదె ?యింటి దైన నౌఁ,
బెద్ద యటంచు దుర్మతిని బెంపొనరించినఁ గీడు దెచ్చెడిన్
నెద్దును సాధువం చనిన నెన్నఁటి కేలియు ముప్పు వచ్చెడిన్
దద్దయు దూరపున్నగము దా నును పన్న జనోక్తి గాంచుమా !

వ. అని తెలియఁ జెప్పు మహేశ్వరునకు మహేశ్వరి యిట్లనియె 84

ఆ. అల్లునిపయిద్వేష మలవడి నంతన
బిడ్డమీఁది ప్రేమ విడువ వశమె ?
ముండ్ల గూడి యున్నఁ బువ్వును గోరరా !
పుట్టినిల్లు చేరఁ బోదు ననఁగ. 85

చ. ఇనుమును గూర్చి యగ్నియు ననేకము సమ్మెటపోటు లందుఁ బై
నొనరఁగ వజ్రతోఁ గలసి యొప్పెడు చాఁపయు నెందుచుండు, న
ట్లినఘచరిత్ర !నా వలన నబ్బును నీ కవమాన మంచుఁ జె
ప్పినఁ జెవి దూర దయ్యె శని వెంటఁ బడన్ మరలింపశక్యమే ?

కం. అని యెంత చెప్పినను సతి
విన నొల్లక జనకుఁ గూర్చి వెక్కుటకై మం
కును బూని యున్నఁ గని యిం
కను జెప్పఁ దొడంగె నాపెగమనము మాన్పన్. 87

క. పిలు పేనియు లే దాయెను
కలికీ ! పోవలదు వలదు, కఠినులకడకున్
బలుకరు నీతో నెవ్వరు
పిలపించుట దప్ప దచట వెడలిన ననఁగన్ 88

క. శివ ! శివ !నా మొఱ వినవ ? య
భవ !సంతతవిభవ !నీదెభారంబు సదా
శివ ! భవభయహర నాకుసె
లవు, పోయెద సెల వన నిటలనయనుఁ డనియెన్ ! 89

క. వలపుం గోల్పోయిన పితృ
నిలయంబు యమాలయంబు నిశ్చయ మిది, పో
వలదు, వలదు, వల దన విన
వలదే !దక్షసుత !చాలు వాదం బనఁగన్ 90

క. తెలియనటు లనర్థంబులు
తెలిసిన మీ వంటివారుఁ దెలుపం దగునా ?
యిలఁ గలవా ?నిలఁ గలవా ?
మెలఁగున ? నరనిమున మేని మేనిన్నసువుల్. 91

వ. అని యెదురు ప్రశ్నించి భర్తయాజ్ఞకై నిరీక్షించు చున్న యా
మందభాగ్యురాలి మూర్ఖపుఁ బట్టుకు ఖిన్నుండై శంభుండు 92

క. నూయి గలదు ముందుకుఁ బోఁ
బోయినచో; వెనుకవెపుఁ బోయిన యెడలన్
గోయి గలదు; తప్పించు ను
పాయం బేమియును దోఁచఁ బడ దని వగచెన్ 93

మ. అవమానాగ్ని దహించుఁబొమ్మనినచో, నాఁపన్ బ్రయత్నించినన్
శవముం జేయును శోకవహ్ని, యెటులన్ సల్పంగ లే నంచుఁ గ
న్గవ మూఁతం బడఁ దాల్చె మౌన మది స్వీకారంబుగా నెంచి, త
త్సవనంబు న్గను కోర్కి మిక్కుటముగాన్ సంతోషచిత్తంబునన్
సవరించెన్ బయనంబు దక్షసుత, దా సంరంభ మేపారఁగన్ 94

వ. అయ్యవసరంబున నీశ్వరుండు రానున్న యాపదం దలంచి తనలో
ని ట్లనియె. 95

తే. తల వడెడుచోటునకుఁ గాళ్ళు తామె యీడ్చు
ననెడి సామెత యచట యథార్థ మయ్యెఁ
గాక మానదు కానున్న కార్య మెపుడు
విధి బలీయము కా దనవీలె ? యనుచు 96

గీ.మా. ఒంటరిగఁ బోవు చున్న నయ్యువిదఁ గాంచి
సకలమర్యాదలం గూర్చి సాగనంపుఁ
డనుచుఁ బ్రమథగణములకు నాజ్ఞసేయ,
నాడుచును బాడుచును నతిహర్ష మొప్ప
ఛత్రచామరరాజలాంఛనములు గొని
వందిగణములు స్తోత్రముల్ పఠన చేయ
జయజయధ్వానములు నాకసంబు ముట్ట

వెంట వారలు నడువఁగ వివిధగతుల
వాద్యములు మ్రోఁగు చుండ నవారిగాను
నందివాహనియై ప్రయాణం బొనర్చి
దక్షమఖమంటపంబున దక్షజాత
చేరి కాంచెఁ బరిస్థితుల్ చిత్రముగను 97

చ. పిలువఁడు తండ్రి రమ్మనుచుఁ, బ్రీతి చెలంగఁగఁ దల్లి వక్కౕ దక్కౕలు కుశలం బటే యనుచుఁ గాంచరు, బంధుజనంబులుఁ సదస్యులు సయితంబుఁ జూచియును జూడనియట్లు నటింత్రు, కానయై పలికిన నొక్కరేఁ బదులు వల్కరు, కర్ణములందు మ్రోఁకులే మొలచినవొక్కో ! తాళములు మూఁతులకుఁ బిగియింపఁబడ్డవో !

క. దాక్షాయణి యిటు నా స్థితి
వీక్షించెను బతిపలుకులు వీనుల మ్రోఁగెఁ
నక్షుల నశ్రులు నిండఁ
వక్షోజము లదర జీఅవడు కంఠముతోడఁ 99

మ. జనకా ! నాపయిఁ గోపమా ? కినుక నీజామాతపై నిర్గెనా ?
ఘనదోషంబులు మా యెడంగలిగెనా ? కారుణ్యచిత్తుండ ! నీ
మనమం దుంచకు, మ్రొక్కుచుంటిని మముఁ మన్నించి కావంగదే
తనయుల్ నేరక తప్పు సల్ప జనకుల్ దండింపఁగా నేరరే ? 100

వ. అను నాత్మజదీనాలాపంబులకు బాతిగుండెగల దక్షుండుమండిపడి హేళనగా నిట్లనియె 101

ఉ. దోషము లేదు నీ యెడల, దూషితజన్ముని దాన వైతి, నిర్దోషియ ? నీప్రియుండు నయదూరుఁడు, దుశ్చరితుండు వానికిఁ
భూషలు సర్పముల్, మసలుభూమి శ్మశానము, తోళ్ళువస్త్రముల్
వేష మమంగళంబు, పరివేష్టులు ప్రేత పిశాచ భూతముల్
దోషిని నైతి నిన్నొసఁగి ధూర్తునకుఁ నవమార్గగామికిఁ 102

క. శివనింద నిటు వినక లా
శివ ! శివ ! యని మూసికొనియెఁ జెవులను జక్షు
శ్రవముపలెను బుసకొట్టుచు
వివశయగుచు దేహమందు వేపనములతోఁ 103

క. ముడివడఁ గనుబొమ లా సతి
విడివడఁ గ్రొవ్విరులు, సొబఁగువేనలితోడన్
మిడిసిపడు దక్షుఁ గూఱిచి
తడఁబడు వాక్యములఁ బల్కెఁ దత్తఱపడుచున్ 104

సీ. ఎవ్వాని శుభనామ మేప్రొద్దు భజియింప
దోషంబులన్నియుఁ దొలఁగిపోవు
నెవ్వాని గుణముల నేప్రొద్దుఁ గీర్తింప
క్షేమంబు లన్నియుఁ జేరవచ్చు
నెవ్వానిచరితంబు లేప్రొద్దు వినుచున్న
సౌఖ్యంబు లన్నియు జతగఁ జేరు
నెవ్వానిస్మరణంబు లేప్రొద్దు గలిగినఁ
బరమశుభంబులు ప్రాప్తములగు

తే. నట్టి కల్యాణగుణుని, లోకైకగురుని,
హరుని, శంభుని, శంకరు, నాద్యు, శివుని
నింద సేసెడు వినెడు వా రంద ఱిహప
రంబులకుఁ బాసి నరకభయంబు గాంత్రు. 105

క. పశుపతి నిందించి విఁకఁ
బశుముఖ మబ్బెడును నీకుఁ బాపాత్మ ! యిల
న్నశివంబు నీదు మఖము, న
యశమే దక్కెడును నీకు నాసురచిత్తా ! 106

క. దక్షుఁ డిటు విని శివప్రతి
పక్షుఁడు, నవిచక్షణుండు, బ్రాహ్మణవర్గా
ధ్యక్షుఁడు, కోపానలతా
మ్రాక్షుఁడు, బిడ్డ నిట్టు లాక్షేపించెన్ 107

ఉ. వచ్చితి వెందు కిచ్చటి కెవారలు పిల్చిరి పీఁట వేసి నిన్ ?
సచ్చదు నీదువాసనయు నా కిఁక నీ కిటఁ దావు లేదు పో
చచ్చితి వంచు నీవఱకె స్నానము లందఱ మాడినాము సూ !
వచ్చివిసంబుతోఁ గలిసి పా లవి పాలుగ నుండ నేర్చునే? 108

క. రక్తనయన జనకునికఠి
నోక్తులు విని యోర్వలేక యుద్ధతమతియై
రక్తపుబంధముఁ ద్రెంచి, వి
రక్త యగుచు మనమునన్ నిరాశ జనింపన్ 109

ఆ. పాదరసపుఁబూఁత పైకొన్న బంగార
మగ్నివలన శుద్ధ మైనభంగి
దక్షుఁ డిచ్చినట్టి తనువు దగ్ధము చేసి
యాత్మశుద్ధి సేయ నతివ దలఁచి 110

తే. యాగమంటపమందుఁ బద్మాసనమునఁ
గూర్చొనుచు ధ్యానముద్రను గొనియెఁ బతిప
దారవిందంబులను హృదయంబునందు
దృఢముగా నిల్పి తత్స్థిత దృష్టిఁ బూని 111

ఉ. నిను వినలేని నా దయిన నేరఫలంబు భుజింపు మంచు నన్
బనిచెను నీ విధిన్ విధి విపత్తును గూర్చెచె, నీదుసేవకై
యనువుగ లేని యీ తనువు నగ్నికి నాహుతిసేయ నుంటి నా
కనుమతి నిమ్మటంచు నినుఁ బ్రార్థన సేతు ననుగ్రహింపవే !

క. హర ! హర ! హాలాహలమును
వరియించితి, దాని నేన వహియించెద నీ
చరణాబ్జ సుధాస్వాదన
వర మి మ్మని వేడుచుంటి వాత్సల్యనిధీ ! 113

ఉ. ఎన్నఁడొ నిన్ గనుంగొనుట ? యెన్నఁడొ నీ కరుణారసార్ద్రిమా
కన్నులసన్నలన్ మనుట ! కమ్మనిన బిగికౌగిలింతలో
మన్నన లందు టెన్నఁడొకో ! మానుగ నీ పదపద్మసేవలో
నున్నసుఖంబు చూరఁగొనుచుండుట యెన్నఁడొ ? చంద్రశేఖరా !

క. మును బావితి నే దంపతు
లనొ ?కుడువఁగ వలయుఁ దత్ఫలం బంచను నీ
కును నా కీ విధమున నెడ
మును గూరిచిన దురదృష్టమున కే మందున్ 115

విజయ. కన్నతండ్రి యీ విధమునఁ గఠినుఁడై చరించుట నెవ
రెన్నడైనఁ గనియు వినియు నెఱిఁగియున్న వారలొక్కో ?
కన్నబిడ్డ నీదృశముగఁ గనుల నీరు గ్రుమ్మ వాని
కున్నదొ ?నరకమ్ము లేడొ ? యొనరుపంగవలెనొ యిష్టు ! 116

క. పెన్నిధి వని నమ్మితి నీ
సన్నిధిఁ గూర్చు మని నిన్ను సన్నుతి సేతున్
మన్నింపు దీనను నా
పన్నావన ! భక్తపోష ! పన్నగభూషా ! 117

ఉ. అగ్నినిఁ గోరుచున్ శలభ మందు నశించుట గాంతు మారయన్
భగ్నఘటాన జీవములు పాఱక నిల్చునె ? క్రోధరోషశో
కాగ్నుల కీ శరీరమును నాహుతి సేసెద, నీదుపాదసం
లగ్నమనస్క నౌటకు హలాహలధారి ! యనుగ్రహింపవే ! 118

ఎత్తుగీతి. అని వేడుచున్న యంతఁ
గనికరించి విషగళుఁడు
మనమునఁ దోఁచి మగువ
ననునయించు చిఱు లనియె 119

ఉ. నమ్మము, నీ యెడన్ సతియనంబడు నామము సార్థకమ్మ న
న్నమ్మము, నీవె నా సతివి, నమ్మ సతీత్వము నీదు గుప్తవి
త్తమ్మ, సతీమ తల్లులను దాటిన దానవు సుమ్మ ! చెచ్చెరన్
గ్రమ్మఱి రమ్మ పార్వతిగఁ గంజదళేక్షణ ! నన్నుఁ జేరఁగన్ 121

వ. అనునంత నంతఃస్థిమితమతియై సతి-

క. యాగగృహంబున దేహ
త్యాగం బొనరింపఁ బూని తన ప్రాణములన్
యోగపథంబునఁ జేర్చి
యోగాగ్నిం దనతనువును హోమ మొనర్పన్ 122

క. హాహారవములు పుట్టెన్
నా హోమాలయమునందు, ననుకొనికి జనుల్
ఛీ ! హీనుఁడు కన్నకడుపు
నాహుతి యొనరించెఁ దనరుషాగ్నుల నకటా ! 123

వ. అని కళవళపడుచుండు నెడల

ద్వి. హాశ్శరభ, హాశ్శరభ, హాశ్శరభ యనుచు, న
మశ్శివాయ, హ రోం నమశ్శివాయ, యని విన
నార్చుచును లేచి వీరావేశమునను బరి
మార్చెదము దక్షు నని యాయుధము లెత్తు తఱి

భృగువు హోమము సేయ ఋభువు లప్పుడ వీఁక
సెగలు గ్రక్కుచుఁ బుట్టి శివపార్షదులఁ దాఁక
ఘోరాజి శివబలము కొంతవడి పడిపోఁగఁ
బాఱిపోయిరి మిగులువడిన వారలు వేగ 124

వ. అప్పుడు 125

ఉత్సాహవృత్త చావువార్త చలఁగాను సాహసించి చెప్పఁగన్
మాలికి. దేవమౌని చేరె, దేవదేవు సన్నిధానమున్
భావమందు శివునిపాదపద్మముల స్మరింపుచున్
శైవభటుల కన్న మున్న స్వామిఁ జేరి యిట్లనెన్
దేవదేవ! కానఁగలమె! త్రిభువనముల నీ సమున్
జావుపట్టువులను నీవె జంటగా సృజించితౌ
జీవి కాలచక్రమందుఁ జిక్కి శీఘ్రగామి యై
పోవుచుండు, వచ్చుచుండుఁ బూర్వజన్మకర్మచేన్ 126

మానిని. కష్టసుఖంబులు కావడికుండలుగా నొనరించితి వీవె కదా!
యిష్టము వచ్చిన దానిని గైకొను మింపుగ నంచను బల్కితివా
దుష్టుఁడు శిష్టుఁడు చేసిన కర్మకు దోసము పున్నెము దక్కును, సు
స్పష్టముగా జగమందునఁ గాంతుము చంద్రధరా! హర!
మారహరా! 127

తే. సాన వట్టిన నీను వజ్రంబు గాంతిఁ
గాఁక తీసిన, గాంచు బంగారు వన్నె
యెండగొట్టినఁ గొను గ్రమాను నిండుశోభ
ధీరునకు మూఁటి, శోకాగ్ని దెచ్చి పెట్టు 128

ఆ. లేదు గతదినమ్ము రాదు రేపటి రోజు
మంచిచెడ్డ లనుభవించకుండ
భూతదర్పణమునఁ బూర్తిగా గమనించి
భావిముఖము దిద్దవలయుఁ దీర్చి 129

క. దీపము లేని గృహమువలె
పాపలు లే నట్టిగొడ్డు బ్రతుకు విధమునన్ 130
నీ పత్నిలేని యీ యిలు
సూపట్టెడుఁ జిన్నవోయి శోభలు కఱవై 131

క. అని, యేమేమియొ పల్కుచు
మునినాథుఁడు సెలవు గొనియె, మునిలోలుండున్
మనమున మగుదను దలఁచుచుఁ
గనియెన్ సర్వంబు, నపుడు గడబిడవడుచున్ 132

క. ప్రమథులు చేరఁగ వచ్చిరి
ప్రమదను బోనాడి దుఃఖభరితహృదయులై
తమతమశిరములు ప్రభుపద
కమలములను మోపి కనులకట్టలు దెగిపోన్

తే. ఏడ్చుచును నిల్చిపోయి రహీనదుఃఖభార మోపంగ లేనట్లు వంచి తలలు
సామినిం జూడలే మని భూమియందు దృక్కులం జాఁతి యుంచిరి దీనమతులు

క. రుద్రుఁడు గ్రహించె సతికి న
భద్రం బని, వేళగాని ప్రళయం బనఁగా
రౌద్రావతారమెత్తె
న్నద్రులు గంపింప భూమి యల్లల్లాడన్ 134

క. జ్వాలాముఖి ప్రేలెనొ యన
వేల నధిగమించి జలధి వృద్ధిలె ననఁగన్
ఫాలానలనేత్రుండును
హాలాహలధారి యుగ్రుఁడై జృంభించెన్ 135

ద్వి. ప్రళయనృత్యము చేయఁ బరఁగె రుద్రుఁడు తాను
ప్రళయకాలము వచ్చిపడె మీఁద ననఁగాను
ప్రకృతి యంతయును భీభత్సరూపము దాల్చె
వికటాట్టహాసంపువేషమునఁ దా నిల్చె
తక తకిట తక తకిట తాకిట కిట యనంగఁ
బ్రకటతాళ మృదంగరవము చెలరేగంగ
బుడు బుడు బుడు క్కనుచు బుడుబుడుకులు ధ్వనింప
దడ దడ స్వనములను దప్పెటలు నినదింప
ఘుంఘు మ్మనుచు శంఖములు మ్రోయు చుండంగ
బోం బోం భొ భో యనుచు బూర లూఁదఁ బడంగ
గణ గణ గణ గణ యని ఘంటలును మ్రోఁగంగ
గణనాతిశయముగా గజ్జెలును మొరయంగఁ
బ్రళయానిలుఁడు విజృంభణములను గొలుపంగ
ఫెళ ఫెళార్భటుల నిల వృక్షములు గూలంగ
ఝల్లున వడఁకుచు రవి జలదముల దాఁగంగ
ఝుల్లుఝుల్లునను నక్షత్రములు రాలంగ
గడగడడ యని మేఘగర్జ లగు చుండంగ
దఢఢఢ మని పిడుగులు ధరణిఁ బడు చుండంగ
ఛరఛర ఛర యనుచును శంపలును మెఱయంగ
దిరదిర యనుచు ధరణి తిరుగుడ్లు తిరుగంగ. 136

క. జట దీసి త్రిప్పి ధూర్జటి
ఛటాలనుచు, వేగ భువి విసరి కొట్టంగన్
బటుతరశబ్ద మజాండపుఁ
గటాహ మెల్లయెడ నిండఁగాఁ దత్‌క్షణమున్ 137

సీ. ఆకాశముం దాఁకు నత్యున్నతాఖిల
ఘననీలఘనదివ్యకాయ మమర
కాలానలోద్భవకీలానిభములూర్ధ్వ
జగము లంటెడుశిరోజములు వెలుఁగ
ప్రళయకాలాదిత్యుఁబలె లోకదాహక
మైనట్టినేత్రత్రయంబు మెఱయ
దిగ్వళకవ్యాప్తతేజఃప్రయుక్తోద్య
తాయుధహస్తసహస్ర మొప్ప

తే. గళమునఁ గపాలమాలలు గదలి యాడ
భీకరకరాళదంష్ట్రలు బెగడు గొలుప
భువనములు మ్రింగునో యన ఘోరవదన
గహ్వరము తెఱచియు సెగల్ గ్రక్కుచుండ 138

తరువోజ. వీరభద్రుండు నావిర్భవం బొంది
వీరనృత్యము సల్పె భీతి గొల్పుచును
మారణయుద్ధసంభారంబు గాంచి
మారారి హర్షించె మది మెచ్చుగాను
ఘోరరూపము గాంచి కువలయ మదరె
క్రూరమానసములు గ్రుంగఁ దొడంగె
వీరుల నుత్సాహవృత్తులు పెరిగె
భీరువుల్ వాఱిరి విరవిర మనుచు 139

తే. హరహరా! యంచు నార్చిన నగ్ని ముఖము
నుండి కురియును జగములు మండు ననఁగ
ధరణి నడుగిడఁ గంపించి దద్దరిల్లు
హుంకరించినఁ దారలు నురలు భువిని. 140

వ. అంత వీరభద్రుండు సర్వభద్రుని ప్రోల మోఁకరిల్లి పదకమల
ములకు మ్రొక్కి ముకుళితకరుండై నిలిచి 141

సీ. ఓదీనరక్ష! బ్రహ్మాదిదేవతలు నీ
యాదరముననె మర్యాద గాంత్రు
సూర్యచంద్రాదులు చుక్కలు నీయాజ్ఞ
చొప్పున గతులను దప్పకుండు
దేవ! నీ యానతి ధిక్కరించుట ప్రవా
హంబున కెదురీఁత యగును గాదె
యీశ! నీ కపరాధ మిసుమంత సలుపుట
సవిత్రునిపై దుమ్ము చల్లుటె యగు

తే. నీ దయారసవృష్టి నా మీఁద గురిసి
పెంపు మన్నింపు నన్ను దీవింపు పంపు
ధరణిలోఁ గల ఘనకార్యసరణియందు
నేను జేయం దగిన కర్జ మెదియొ చెపుమ. 142

మత్తకోకిల. బమ్మదేవర వైతునా? తమపాదపద్మములందు; నా
తమ్మికంటిని గేలుమోడుపుఁదాల్పుగా నొనరింతునా?
యిమ్ముగాఁ దమసేవలందు సురేశ్వరు న్నియమింతునా?
సమ్మతి న్నమృతమ్ము దెత్తున? సర్వదిక్కులు గెల్తునా?

సీ. శేషుని నాలుకల్ చీల్చి ముక్కల నాఱు
బయట నాఱఁగ వేయవలయు నొక్కొ?
పంచభూతమ్ములఁ బట్టితెచ్చియును మీ
పనియందు నియమింపవలయు నొక్కొ?
తొమ్మిదిగ్రహములఁ దోడ్కొనివచ్చి సో
పానంబులుగఁ గూర్పవలయు నొక్కొ?
పృథివీగగనముల రెండింటిజత నెడఁ
బావి బోర్లించఁగ వలయు నొక్కొ?

తే. కులగిరీంద్రములఁ బిండిగాఁ గొట్టవలెనా ?
యుదధిఁ గొనితెచ్చి పుక్కిట నుంపవలెనా ?
యేమిసేయంగవలయునో ? యెఱుఁగఁ జెప్పుఁడు
తలనడఁచి దాని నొనరింతుఁ దండ్రి ! వినుఁడు. 144

వ. అను వీరభద్రునిసాహసవీరాలాపంబులకు శర్వుండు మనంబున
హర్షించి క్రోధోత్కర్షంబున. 145

క. దాక్షిణ్యవిహీనుఁడు మన
దాక్షాయణి మ్రింగి నీళ్ళుద్రావెన్ ద్రేన్చెన్
దక్షిణమునఁ గదలుమ యా
రాక్షసు దక్షుని వధింపఁ గ్రతువు మథింపన్ 146

క. లక్ష్యము సేయకు ద్విజులను
లక్ష్యము సేయకుమ దివిజులను సహితంబున్
లక్ష్యము సేయకు బ్రహ్మను
లక్ష్యము సేయంగవలదు లక్ష్మీనాథున్ 147

స్రగ్వి. వీరభద్రుం డటుల్ వించు రుద్రాంఘ్రులన్
సారెకున్ మ్రొక్కుచున్ శైవసైన్యాళితోన్
గ్రూరుఁడౌ దక్షునిం గూల్చ నుత్సాహి యై
ధీరుఁ డట్లై బయల్దేరి సాఁగెన్ వెసన్ 148

మధ్యాక్కర. వీరరసంబు రూపుగొని వెడలుచు నున్నదో యనఁగ
వీరభద్రుఁడు శివసేన వెన్నంటుచుండఁ దాఁ జనఁగఁ
గ్రూరునిపాపముల్ పండి కువలయ మొందెనో యనుచు
ఘోరయుద్ధఫలితములను గూర్చి జనులు భయపడుచు 14

మధ్యా. ప్రళయ మేఘమ్ములు సైన్యపటలము లి విఱఁ గా వనుచుఁ
దళకమను మెఱపు లాయుధమ్ములు గా వవి యనుచు
ఘోరఘోరగర్జము లవియ పెనుసింహనాదముల్గావు
కరవాళ మొనరించువృష్టి కరిగిరులను ముంచు నందు

ఆ. భయముచేత మిగుల వడవడ వడఁకుచుఁ
ప్రాణము లఱచేతఁ బట్టుకొనుచు
మిన్ను విఱిగి వచ్చి మీఁదనే పడె నంచు
నాత్మరక్షణార్థు లయిరి వారు 151

ఉ. కొండలఁ బిండిపిండిగను గొట్టఁగ వచ్చెడు వజ్రియేయనన్
మండఁగఁజేయ ఖాండవము మండుచువచ్చెడు నగ్నియే యనన్
దండనసేయఁ బాపులను దండధరుం డటు వచ్చెనో యనన్
దుండగులన్ వధింపఁగను దోర్బలయుక్తుఁ డమోఘశక్తుఁడై

వ. వచ్చి దక్షముఖవాటికం జొచ్చి ప్రళయకాలరుద్రుండై వీరభద్రుండు!

భ్రువ. జయధ్వానముల్ సల్పు సైన్యంబుతోడన్
లయాకారమున్ దాల్చి లంఘింపఁ బైనన్
భయభ్రాంతులై దక్షపక్షుల్ సదస్యుల్
దయాసాగరా! భద్రదా! పాహియంచున్ 154

తోటక. ఘటియించుచు మ్రొక్కులు గానక ది
క్తటముల్ ఘనభీతిఁ గకావికలై
నిటలాక్షు మనంబున నిల్పి తటి
త్పటువేగములో నెటొ పారి రిటుల్ 155

సీ. వీడి, న న్నిచ్చట వెడలె దెక్కడి కను
పలుకులు చెవిలోనఁ బడకమున్నె

నను విడిచి చనుట న్యాయమా? యనియెడు
పలుకులు చెవిలోనఁ బడకమున్నె
వెంట వచ్చినవాని విడువం దగునె? యను
పలుకులు చెవిలోనఁ బడకమున్నె
నేను వచ్చువఱకు నిలుఁడు నిలుం డను
పలుకులు చెవిలోనఁ బడకమున్నె

ఆ. తనయు సఖిని మిత్రుఁ దనశిష్యుఁ గానక
తల్లి, భర్త, సఖుఁడుఁ దగ గురుండుఁ
బాఱఁ దొడఁగిరి తమపాదాలు గొనిపోవ
స్థలములకును గ్రొత్తతలములకును 156

క. కలవరపడు దక్షుని సే
నలపై వీరుండు, భయమునన్ 'మే' యను మే
కలమందపైఁ బడు బె
బ్బులి చందంబునను నారుపుల లంఘించెన్ 157

ఆ. బ్రహ్మతేజమునను బ్రాహ్మణబలమును
శైవతేజమునను శైవబలముఁ
బెనఁగఁ దొడఁగె వైరి పీఁచం బడంచుచు
ధర్మమునకె జయము దక్కెననుచు 158

సీ. ఖడ్గముల్ శిరముల ఖండించు చుండఁగా
శూలముల్ పొట్టలఁ జొచ్చి వెడల
ముసలప్రహారముల్ మెసలకుండ నొనర్ప
బల్లెముల్ బొమ్మల బ్రయ్యఁ జీల్పఁ
దూపులు దేహముల్ తూఁటులు పడఁ గ్రుచ్చ
నీటెలు మేనుల నాటుకొనఁగఁ

గదలు దలలఁ జితుకంగఁ జేయుచు నుండఁ
దోమరఘాతలు దుము రొనర్ప

తే. నుండి యుండియ మూర్ఛల నొందుఛంగి
సాపరాధులు చేయు సాష్టాంగమువలె
మొదలు నఱుకంగఁ బడు వృక్షముల విధమున
నేల కొఱఁగిరి, వ్రాలిరి కూలి రంత 159

వ. వీరభద్రుండు విజృంభించి హరహరా! యని జయ నినాదములు
చేయుచు 160

క. మీసము దువ్విన భృగుముని
మీసంబులు వెఱికి పండ్లు మిలమిల మెఱయన్
హాసము చేసిన పూషుని
బోసిఁగ నొనరించె బోరుబోయన నేడ్వన్ 161

ఆ. కన్ను గీటి దక్షమన్ననఁ బొందిన
భగుని కనులు పెరికి పాఱ వైచె
వివిధదోషులకును వేర్వేఱు విధమున
శిక్షలు తగుకీతి చేసి యపుడు 162

తే. దక్షుకంఠంబుఁ ద్రుంచియుఁ దచ్ఛిరంబు
హరహరా! కొను మిదియ పూర్ణాహుతి యని
భగుభగ్గున మండెడు నగ్నియందు
వ్రేల్చె శివునాజ్ఞలను నెఱవేర్చె నంత 163

తే. హోమకుండంబులందున నుమిసిరి మల
మూత్రములచేత నపవిత్రము లొనరిచిరి
యున్న లన్నియు నార్పిరి యాగశాల
పాడువడుచు శ్మశానంపుజాడ గాఁగ 167

స్రగ్ధర. హాహాకారంబు లేచెన్ పలె యజనసదనమం దంతట న్నిండి పోయెన్
మోహభ్రాంతుల్ భయంబుల్ మునిసురవరులన్ ముంప నవ్వారిరా
జాజిన్
'నోహో !'యన్ వీరభద్రుం డురువిజయరవం బొప్ప
సైన్యంబుతో ను
ల్సాహానందంబు మీఱన్ జయజయతుహరా! శంకరా ! యంచు
మఱ్ఱైన్ 168

శి వా ను గ్ర హ ము

వ. అప్పుడు సురలును భూమిసురులును నేకకంఠులై 169

క్రౌంచపద. వారిజగర్భోపేంద్రులతోడన్ బరమశివునియెడఁ దమయ
పరాధం
బారసి పశ్చాత్తాపముచేతన్ హతదురితచయులు నయి రజితాద్రిం
జేరిరి మ్రొక్కుల్ సల్పిరి భక్తిన్ శిరవినమితులుగఁ బలికిరి
యిట్టుల్
గారుణికాత్మా! యోపరమేశా! కనికరమున మముఁ గను జగదీశా!

మధురాక్కర. నాగభూషణ భూషిత ! నందివాహన ! వి
రాగ ! మేరుచాప ! పురహర ! హర ! శ్మశానవాస !
త్యాగమూర్తి ! సూర్యాగ్నినయన! భస్మలేపితాంగ !
వేగ కరుణించి మముఁ బ్రోవవే! ప్రణామము లివిగో ! 171

అంతరాక్కర. విశ్వనాథ త్రినేత్ర ! పినాకపాణి !
శాశ్వతానందదాత ! శశాంకమౌళి !
యీశ్వరా ! భక్తలోకహృత్కమలవాస !
విశ్వతోముఖ ! నీకు వేల్ దండములు. 172

అల్పాక్షర  నీలలోహిత! రుద్ర నిర్మలాత్మ! ఫాలాక్ష! యుగ్ర!
కపాలహార!

శూలి! మృత్యుంజయ! సుగుణరాశి! కాలకంధర!
నమస్కారములు

మహేశ్వర బ్రహ్మడవై నీవు సృష్టి నొనరుతు, స్థావరజంగమము లెల్ల మా
విష్ణుడవై యా సకలమును బోషించెదవుర, నీవ మరి రుద్రుం
డవయి సర్వము లయ మొనరించి తాండవనృత్యము సలుపుదు
శివుడవై భవములు తుడిచెదు సదాశివుడవటండవు సుమ్మీ!

దండకము. శ్రీకంఠ! లోకేశ్వరా! నిత్యకారా, నిరాకార నిస్సంగ
నిర్ద్వంద్వ నిర్దోష, నాగేంద్రహారా! దయాసాగరా, దుష్ట
సంహార, యో సుందరాకార, యో దీనమందార, యో వార్ధి
గంభీర, యో శూర, యో వీర, యో మేరుధీరా, సుయోగీ
హృదాకాశసంచార, యో దుఃఖదూరా, సదానందబృందార
కాధార, కందర్పగర్వాపహారా, యుమామానసాంభోరు
హాంతర్విహారా!

ఓ విశ్వరూపా! యమోఘప్రతాపా! మహామేరుచాపా
జగద్దీపదీపా, విధూతత్రితాపా, వినిర్ధూతపాపా!

మానసం బెప్డు నీ ధ్యానమే చేసెడిన్, జిహ్వ యెల్లప్డు నీ పేరు
గీర్తించెడిన్, శ్రోత్రముల్ నీ కథాపానముం జేసెడిన్, హస్తముల్
సర్వదా నినుం బూజించెడిన్, నేత్రముల్ నీదురూపమ్ము
దర్శించెడిన్

వ్యోమకేశా! దినేశప్రకాశా, మహాకాలపాశప్రణాశా,
సురేశార్చితా, కృత్తివాసాదివాసా, గిరీశా, మహేశా, యుమేశా
నతీశా, త్రిశూలాయుధా, చర్మచేలా, గళమ్ముండమాలా మహా
కాల, కాలాంతకా ఫాలనేత్రా, సుగాత్రా!

నీ మాయదాటంగ నెవ్వారికిం బోలు స్వామీ ! కృపానుదృష్టిన్ ప్రసారింపు మాపై, క్షమాభిక్ష మాకుం బ్రసాదింపుమా ! మమ్ము రక్షింపుమా ! యో విరూపాక్ష ! ఫాలాక్ష పక్షధ్వజ ధ్వంసకా !
యో మహాదేవ ! దేవాధిదేవా ! నమస్తే ! నమస్తే ! నమస్తే ! నమః

క. అపరాధులమురశంభో !
నెపమెన్నకమే మొనర్చు నేరంబులు న
త్కృపఁ బ్రోవర, నీదయలు ని
రుపమానములుగద శర్వ ! యుగ్ర ! మహేశా ! 176

క. చాలును ప్రాయశ్చిత్తము
చాలును చాలనఁగ నదియుఁ జాల జరిగెరా
ఫాలాక్షా ! మునిలోల ! క
పాలధరా ! నీలకంఠ ! పాపవిలుంఠా ! 177

క. పాపమునకు నీ పేరు సు
రాపగ, తాపత్రయముల నార్పు నమృతమౌఁ
గోపింపకు మాపై నికఁ
గాపాడర, శరణు శరణు కైలాసపతే ! 178

మ. అని బ్రహ్మాదిసురేంద్రదేవమునిముఖ్యాదుల్ ద్విజశ్రేష్ఠులున్
ఘనవేదోక్తవిధిన్ సమంత్రకముగాఁ గైలాసనాథున్ సనా
తను, భక్తానను, పావనున్ సుజనమందారున్ దయాపారునిన్
మునివందారుపదారవిందయుగళున్ మోదాశ్రువుల్ గారఁగన్
దనువుల్ పుల్కరిఁగ, స్తోత్రముల్ సలుపుచుం దాదాత్మ్యముం
జెందఁగన్

క. దరహసితాననుఁ, భవు, శం
కరుని దయాపాంగ వీక్షగంభీరాక్షున్
వరదాభయముద్రాచింత
కరకమలుని, వేడఁ దొడఁగెఁ గమలాక్షుఁ డొగిన్ 180

క. శరణాగతవత్సలుఁ డను
బిరుదము నీక తగు నీదుబిడ్డల యెడలన్
నరమర యించుక లే దిఁకఁ
గరుణాబ్ధీ! నేఁడు వేగ గావవె మమ్మున్. 181

క. పరపీవ్యామోహము, ధన
మదము, కులాధిక్యతాభిమానము, నేనే
చదువరి నను నహ మివి నీ
దుదయకు దూర మ్మొనర్చి, దుఃఖము గూర్చున్ 182

క. యాగమ్ముఁ బూర్తి చేయుము, వేగము లోకములబాధ విడఁగొట్టు మహో
తేఁగలు పొదుఁగును గ్రుమ్మిన బాగుగఁ బా లిచ్చు గోవు బాధ్యత గనవే! 183

వ. అనినం బ్రమోదాంతరంగుడై యంగీకరించి. 184

మధ్యాక్కర. మొఱ లిడువారిఁ గనికరమునఁ గావ బిరబిరఁ జనెను
పరమదయామూర్తి, భక్తవత్సలుఁడు త్రిపురహరుఁడు
కరములను మొగిడ్చి దక్షకాంతయుఁ గన్నీటిచేతఁ
బరమేశ్వరుని పాదములను బ్రక్షాళనముచేసి నిల్చె. 185

క. మతిహీనుఁడు, పతితుఁడు దన
సుతను సతినిఁ బొట్టఁ గొన్న క్షుద్రుం డైనన్
బతినాకు, క్షమింపం దగుఁ
బతిభిక్షను బెట్టు మనుచుఁ బ్రార్థింపంగన్ 186

సీ. తల లేక పడి యున్న దక్షునకును మేష
శిర మతికియు లేపె శివుఁడు దయను
కండ్లు గోల్పోయి యాక్రందించ, బర్హి. సం
బంధచక్షువులను భగున కిచ్చెఁ
బోఁగొట్టుకొని పండ్లు బొక్కి నోరై యున్న
పూషునకుం బిష్ట భోజన మిడెఁ
బెఱికిన మీసముల్ పేఁడియై యున్నట్టి
భృగున కజశ్మశ్రులగతిఁ గూర్చె

తే. ఖండితాంగులు దేవతాగణవరులకు
నవయవవిహీనులౌ ఋత్విగాదులకును
నితరవికలాంగులగువారి హీనము లగు
నవయవములు ప్రసాదించె హర్ష మొదవ 187

తే. పక్షపాతవిరహితుఁ డా పరమశివుఁడు
నందఱ న్నేకవిధముగా నాదుకొనియె
సూర్యకిరణాలు సమముగా సోఁకు జగతిఁ
దండ్రి సమదృష్టిఁ జూచు సంతానములను. 188

మధ్యా. కరుణామయుఁడు గాన శివుఁడు కనికరించెను దక్షు; మేష
శిరుఁడు లేచెను, సర్వముఁ గని సిగ్గున మే మే యనుచును
సురరక్షకుని ముందు గాంచి, చూడఁ జాలక తల వాంచి
చరణములు శిరమునఁ గొని స్తవము సేయఁ దొడఁగె నిట్లు. 189

## అక్షరి ప్రాస సీసములు

గర్వాంధుఁడను నేను గన్నుఁ గానక మిమ్ము
దుర్వ్యసనము లాడి దోషి నైతి
దుర్విధిహతుఁడ, నా దుశ్చర్యలవలన
నోర్వఁ జాలక ప్రాణ మొడ్డె బిడ్డ.
నిర్వికారుఁడవు వినిర్మలాత్మకుఁడవు
సర్వజ్ఞుఁడవు నీవు సర్వభద్ర!
నిర్వైరభావుని నినుఁ గంటి ముక్కంటి!
సర్వేశ్వరా! కావు శరణ మంటి

తే. సర్వసుఖములు చర్వితచర్వణములు
శర్వ! నీ పాదసేవ శాశ్వతసుఖదము
నిర్వివాదాంశ మిది యగు నీలగళ! సు
పర్వవందితశుభపాదపద్మయుగళ! 190

సీ. కృపణుండ, క్రూరుండ కించిజ్ఞుఁడను నేను
గపటాత్మకుఁడ నతికఠినమతిని
నపరాధములు చేయునలవాటు నాయది
నెపము లెన్నక ప్రోచు నేర్పు నీది
తపములు వ్రతములు దానమ్ము లెఱుఁగను
జపములు ధ్యానముల్ సంధ్య లెఱుఁగఁ
గపివోలె సంసారకాననమందునఁ
జపలుండనై సదా సంచరింతు

తే. కృపకుఁ బాత్రుఁడ నె ట్లౌదుఁ గృత్తివాస!
యుపనిషద్వనసంవాస! వ్యోమకేశ!
శపథముం జేసితివి 'నన్ను శరణు గొన్న
శ్వపచు నైనను గాతుఁ దత్క్షణమ' యంచు. 191

తే. ఎటులఁ బ్రోతువో నన్ను నీవే యెఱుంగు
దిష్టమే నీది నెఱవేరు నెప్పుడైన
నంతయును మనమేలుకే యనెడు సూక్తి
నమ్మితి నని మ్రొక్కెఁ బద్మనాభుఁ డపుడు

క. యజ్ఞము భంగం బయ్యెవి
ధిక్షా! లోకంబులకు నది యనర్థ మగున్
యజ్ఞము పూర్తిం జేయుము
యజ్ఞఫలద! యజ్ఞకర్త! యన దయతోడన్ 192

విజయ. పరమశివుఁడు సంతసించి పరిసమాప్తి చేసె మఖము
సురలు, మునులు, ఋషులు భూమిసురులు, తృప్తి చెందిరపుడు
కరువలి మెలమెలన వీచెఁ గాంతి నిండె దిశలయందు
ధరణిజనులు నిండుమనము దాల్చిస్వస్థు లపుడు గాఁగ 193

సీ. మేషశీర్షుం డయి మేమే యనుచుఁ జూచు
దక్షునితలను హస్తమున నిమిరి
పాపంబు లన్నియు భస్మంబు లయ్యెఁ బ
శ్చాత్తాపవహ్ని నిశ్చయము సుమ్మి
భక్తులందఱ నీవు పరమభక్తుఁడ వైతి
నిన్నుఁ జేరిచితి నా సన్నిధికిని
నన్నుఁ బూజింపుచు నిన్ను స్మరింపని
వారిపూజలు సమాప్తములు గావు

తే. శత్రుమిత్రులు లే రంత సములు నాకు
భక్తు లెవరైనఁ బెడదారి పట్టి చనిన
స్వల్పముగ దండన మొనర్చి చక్కఁ జఱతు
భక్తవత్సలుఁడను పేరు వడసితి నన 194

మధ్యా. వనజోద్భవాదులును దమవాసములకు సెల వొందఁ
దనపతివారములు నిజధామముఁ బో నాన తిచ్చి
మనమునఁ బ్రియురాలిమమత మఱపునకును రాక వెర్రి
తనమున వనమునఁ జేరి తలఁచుచుండె సతిని. 195

వ. సతీవియోగవిభ్రాంత చిత్తుండైన సదాశివుని భావనా ప్రపంచం
బునఁ బొడగట్టిన సతిఁ గని యోర్వఁ జాలక శివుండు. 196

మానిని. ఆఁగుమ యో సతి ! యాఁగుమ నీ దగునడ్గుల జాడల
నందుదు నే
దాఁగుడుమూఁతల స్థానము గా దిది, తాళ, వియోగము తాళ,
సఖీ !
వేగిర మేలర ! వేషము మార్చియు వెంటనె వచ్చెద వేడుకతోఁ
బాగుగ నాయెడబాటునఁ గల్గిన బాధ లెఱుంగుదు భావనలోఁ.

కవిరాజ విరాజితము

వడివడి నీ దెన వచ్చుచునుంటిని పర్విడఁ బోకుమ భామినిరో !
యెడ మది గన్గునె యెక్కువ వేగిర మీ విధి నీ విటు లేఁగినచోఁ
దడఁబడఁ బోకుము, ధైర్యము వీడకు తప్పదు నీ వ్యథ,
తథ్య మిఁకఁ
గుడిచినఁ బోవును గూర్చిన కర్మలు, కోవిద ! కుందుట గూడ
దిటుల్ 198

వ. అప్పు డట్లుఁ గొంతశాంతతృప్తచిత్తుండై సాంబుండు 199

క. దక్షిణదిశగా నొక వట
వృక్షచ్ఛాయను సమాధికృతుఁడై తనలో
సాక్షిగ నిల్చెను దన్నే
వీక్షించుచు స్థాణువుగను వెలసెను జగతిఁ 200

ఉ. శంకర !సాధుమానసవశంకర !భక్తజనాళిదుఃఖనా
శంకర !క్రూరరాక్షసనిశాటభయంకర !పద్మవజ్రరే
ఖాంకితపాదపంకజ !వృషాంక !శశాంకజటా !శుభంకరా !
సంకటదూర ! దోషహర ! సజ్జనశుద్ధమనోబ్జమందిరా ! 201

తోటకము. అరిసూదన ! సాంబ ! శశాంకధరా !
పురదాహక ! పుణ్యక ముండధరా !
దురితఘ్న ! భయార్తివిదూరకరా !
కరుణాకర ! శంకర ! కాలహరా ! 202

మాలిని. ధవళతనుమహేశా ! దక్షయజ్ఞప్రణాశా !
భవభయహర ! యీశా ! భక్తిదా ! వ్యోమకేశా !
దివిజభయవినాశా ! దివ్యకీర్తిప్రకాశా !
శివశివపరమేశా ! చిద్విలాసా ! గిరీశా ! 203

ఇది శ్రీవత్ససగోత్ర పవిత్రాపస్తంబసూత్ర
రాజయమంత్రిజ్ఞపౌత్ర లక్ష్మణకవివరపుత్ర
రాజేశ్వరకరుణాపాత్ర సుకవిజనకమలమిత్ర
గంగారాజేశ్వర కవిశేఖరప్రణీతం బగు
పార్వతీవిజయప్రబంధంబున
సతీవియోగం బను
ప్రథమఖండము



# పార్వతీ విజయము

## ద్వితీయ ఖండము

### గౌరీజననము

శ్రీ కైలాసము వీడిపోవుటలు వైచిత్ర్యక్రియల్ నీవి, శ్రీ
లోకేరామయ, సన్నుతించి, కొని మా లోకంబుకుం దెచ్చె నీ
భూకైలాస మొనర్చె మంత్రపురి, శంభో శంకరా! పాహి మాం
శ్రీకంఠా! పరమేశ్వరా! హరహరా! శ్రీశైలసిద్ధేశ్వరా! 1

ఉ. శ్రీసతిఁ బాయుటల్, మదిని జింతిలుటల్ నిహభోగరాశిపై
వాసన వీడుటల్, వననివాసము జేయుట లెవ్వడున్ సతీ
ధ్యాసయె తప్ప వేరొకటి ధ్యానపథంబున లేక యుండుటల్
నీ సతితోడఁ గూడుటకు నిన్ను సమర్థునిఁ జేయుటల్ ప్రభూ!

సీ. సతి లేక నీ సేవ సల్పువారలు లేరు,
సతి యుండియును లేనిసమము నాకుఁ
గాపురం బది నీకుఁ గానన భూములు
కాపురం బది నాకుఁ గాననమ్ము
సంసారమును నీవు సాఁకుచు నుంటివి
సంసారమును నేను జరుపు చుంటి
మదనుఁడు నీ దృష్టి మఱలింప నేఱఁడు
మదనుఁడు నా దృష్టి మార్చ నెపుడు

తే. నామమున నొక్కఁ డైతిమి న్యాయ మొప్ప
నిద్దఱికి బ్రతు కేర్పడె నివ్విధమున
స్వామి వీ వైతి నేను సేవకుఁడ నైతి
సేవ చేయఁగ నే నుండిఁ బోవు మంటి

క. సతి యోగాగ్నిం దను వా
హుతి చేసియు, శీఘ్రమున హిమోర్వీధర భూ
పతియింటఁ బుట్టె నా పశు
పతినిఁ బతిగాఁ బడసె ననుచుఁ బల్కిన సూతున్. 4

క. కని కులపతి శౌనకుఁ డతి
వినయవిధేయతలు మీఱ వేడుచు ననియెన్
వినిపింపుఁడు తద్గౌరి
జనన సువృత్తాంత మంత శ్రవణము లలరన్ 5

వ. అను నప్పుడు 6

క. ధన్యాత్ములు, కృతకృత్యుల
నన్యమనస్కు లగువారి కాహైమవతీ
కన్యామణి సుచరిత్రము
మాన్యుఁడు సూతుండు వల్కె మందస్మితుడై 7

సీ. ఘనచుంబితములు శిఖరశిరముల నెత్తి
మణి నేత్రములఁ బరామర్శ చేయుఁ
డటపక్షు లనదు హస్తములను జూచుచుఁ
గంచె నిర్మించును గాఁపునకును
శరభ కేసర దంతి శార్దూల రావము
లనిమిషు కేరల నవంఁ గొట్టి

గంగాతరంగణీగములను బ్రవహించి
సస్యసేచనముల సౌరునించు

తే. వృక్షరాజము లనియెడు వేత్రరాజి
నెత్తి పశుపక్షులన్న దలించు చుండు
భారతావని కేదారపాలకుఁ డుగ
నిలిచి యెల్లప్పుడు హిమగిరి నేలతేఁడు 8

సీ. వివిధలతాగుల్మ వక్షంబులకు నెల్ల
నాలవాలంబు హిమాలయంబు
భూచర జలచర ఖేచరంబులకును
నాలవాలంబు హిమాలయంబు
నవరత్నములకు నానాధాతుచయముల
కాలవాలంబు హిమాలయంబు
వనమూలికాది దివ్యౌషధు లన్నిటి
కాలవాలంబు హిమాలయంబు

తే. వరదివిజ కేళికోద్యాన వనములకును
మునిజనోచిత ఘనతపోవనములకును
పరమపావనతీర్థ సంవాహినులకు
నాలవాలంబు సతము హిమాలయంబు 9

వ. మఱియు నందు

సీ. వజ్రకుడ్యంబులు పవడంబు గంబముల్
మరకతభూములు మహిమదెలుప
మాణిక్యవేదులు మహితవైడూర్యంపుఁ
గడపలు సొంపులఁ గరపుచుండ

గోమేధికంబుల గోపురంబులు మించ
మౌక్తికతోరణ మాల లమరఁ
బుష్యరాగద్వారములు హరినీలంపు
ద్వారబంధమ్ము లందమ్ము గొలుప

తే. నాకసము నట్టె ముద్దిడు హర్మ్యయుతము
భూమి దిగి వచ్చె నా స్వర్గపురి యనంగఁ
బరఁగు చున్నట్టి యోషధీప్రస్థ నగరి
రాజధానిగ నొప్పె నా రాజ్యమునకు 11

క. నందనవనమును మించిన
యందంబున కాస్పదంబు లఖిల విహారా
నందంబుల నిలయంబులు
సుందరవనములకు నెలవు సుమ ! హిమసానుల్ 12

సీ. గంధతరుల నాగకన్యలు జందన
గంధులుఁ బ్రియులను గౌఁగిలింత్రు
పుష్పమధురసముఁ బుష్పంధయమ్ములుఁ
బ్రియయధరరసముఁ బ్రియులుగొంద్రు
జంటజంటలుగ హంసములుఁ బ్రేమికులును
సంగతి జలకేళి సలుపు చుంద్రు
నీరజారికి నై చకోరకంబులు జార
వరులకై విరహిణుల్ వ్యథలు గాంత్రు

ఆ. కోకిలలును మఱియుఁ గోకిలకంఠులుఁ
బరవశులగుచు నటఁ బాడు చుంద్రు
నీలకంఠములు వినీలకుంతలులును
జేరినృత్యములను జేయు చుంద్రు. 13

మ. సమభావుండు, శమాదిసద్గుణ సుసంస్కారుండు, సచ్ఛీలుఁడున్
హిమవంతుండు, ధరాధరాధిపుఁడు, పాలించెన్ సురావాసమున్
హిమశైలంబును, నోషధీనిలయమున్, హేమాద్రిసంకాశమున్
సుమలావణ్యశరీర, మేనకసతీశోభాఢ్యసంయుక్తుఁడై 14

వ. అతని భోగభాగ్యంబు లెట్టి వనిన 15

సీ. హిమవంతు సిరులమహిమలను గనినచో
ధనదుని ధనములు తఱుఁగు తఱుఁగు
హిమవంతు సౌఖ్యమహిమలను గనినచో
సురరాజునీర్ష్యలు పెరుఁగు పెరుఁగు
హిమవంతు తేజోమహిమలను గనినచో
సూర్యచంద్రులప్రభల్ సురుఁగు సురుఁగు
హిమవంతు భక్తిమహిమలను గనినచోఁ
బ్రహ్లాదముఖభక్తి బరుఁగు పరుఁగు

తే. బుద్ధికిన్ సరిరాఁడు విబుధగురుండు
నున్నతికి మేరు వైనను నొగ్గు శిరము
క్షమను భూదేవి కైన భిక్షం బొసంగు
దానమున బలి యైనను దగఁ డతనికి 16

సీ. ఆ మేనకాదేవి యందచందంబుల
నాదిలక్ష్మికి నెన యనఁగ వచ్చు
నా మేనకాదేవి యఖిలవిద్యల యందు
నా సరస్వతి కెన యనఁగ వచ్చు
నా మేనకాదేవి యాప్యాయతను గన
నాదిశక్తికి నెన యనఁగ వచ్చు
నా మేనకాదేవి యన్నదానమునందు
నన్నపూర్ణకు నెన యనఁగ వచ్చు

తే. నాశ్రితుల కోర్కులను దీర్ప నమరతరువు
త్యాగబుద్ధి సమము జలదంబు నకును
క్షమను నారయ నాయమ క్ష్మాసదృశ్యము
సకలజనుల మనుపఁ బ్రేమ, జలధిఁ బోలు. 17

శా. అష్టైశ్వర్యనిధుల్ నిధానములు భాగ్యాలాయురారోగ్యముల్
తుష్టిం జేయఁగఁ జాలకుండె నవి, పుత్రుల్ లేనిమూలంబునన్
నిష్టాపూర్తులు దానధర్మముల నెన్నేఁ జేసియుం దా మనో
భీష్టావాప్తుఁడు గా కదృష్టహతుఁడై విశ్వేశ్వరిన్ వేఁడుచున్ 18

హరిగతిరగడ.

హిమవంతుఁడు సంతానప్రాప్తి కనేకములేండ్లు తపంబొనరించెను
మమత భవాని యతనిభక్తినిఁ గనుమన్నించెను, వరము గ సుత
నిచ్చెను 19

మధురగతి. భవునితపమునకు ఫలమన సునయన
శివునికాఙకు వచ్చిన సతియే యన
నభయవరదకర యంబుజసువదన
శుభసంధాయిని సుందరసురదన
త్రిభువనమోహిని త్రిదశాధారిణి
విభవవిధాయిని వేదవిహారిణి
హరిసోదరి భక్తార్తివిదారిణి
వరదాయిని హిమవనసంచారిణి. 20

మ. ప్రభవించెన్ గిరిజాభవాని హిమవద్భాగ్యంబు నా మేనకా
శుభగర్భంబున మోమువెల్గులు తనూశోచిల్ దిశల్ నిండఁగన్
నభమందుండియుఁ బుష్పవృష్టి గురియన్ నాకౌకసుల్, దేవదుం
దుభులు న్నప్సరసాళిపాడగతులుం దూర్యంబులున్ మ్రోయఁగన్

మ. అకలంకాత్మవిశుద్ధహంసముల, వాచోఽళిప్రగీతంబులన్,
వికచాస్యాబ్జములన్ వినిర్మలములై విప్పారు కన్గల్వలన్,
సుకుమారంబులు, శ్వాసవాయువులతో, శోభాసుగంధంబులన్
సకలోర్వీసలిలాశయంబు వెలసెన్ సంతోషవాఃపూర్ణమై

ద్విపద. అంతట నాదేవకాంతలు వచ్చి
చెంతన నిల్చి వీక్షించియుఁ బ్రేమఁ
చన్నీట జలకంబుఁ బరఁగ నాడించి
చిన్నారిపాపను జేర్చి యూయెలను
జక్కఁగాఁ ధూపంబు సవరించి మించి
యుక్కబొట్టును బెట్టి యొయ్యారముగను
గంధర్వవనితలు గాయకీమణులు
బంధులు ముదమునఁ బాడి రీవిధము. 23

ద్విరదగతి. లాలి, గౌరీదేవి! లాలి, గౌరీదేవి!
లాలి, ముద్దులతల్లి హ్లాది! గౌరీదేవి!
పాలు గావలె నన్న బాగుగాఁ గొను దేవి!
చాలు రోదన లింకఁ జాలు గౌరీదేవి!
తాళధ్వనులతో మృదంగనాదము గూడ
వాలుఁగంటులును నీవాళిగీతులు పాడ
నీలాలకలు వేడ్క నృత్యములఁ దగ నాడ
లోలనేత్రా! సకలలోకాలు నిను వేడ
నేలను వినుచు జలజేక్షణానన! శివుఁ
బాలపాన్పున నిద్ర పోవె గౌరీదేవి!
లాలి గౌరీదేవి! లాలి గౌరీదేవి!
లాలి ముద్దులతల్లి! హ్లాది గౌరీదేవి! 24

మధురగతి. జో జో జో జో సుందరి! తల్లీ!
జో జో యమరక్షోణిజవల్లీ!
జో జో జగతీసురుచిరలీలా!
జో జో సురనుత! సుజనవిలోలా!
యండాండంబున నలరుదు నీవే
పిండాండంబునఁ బెరుఁగుదు వీవే
బ్రహ్మాండంబునఁ బరఁగుదు వీవే
బ్రహ్మకు నండఁగ వఱలుదు వీవే
జో జో జో జో సుందరితల్లీ!
జో జో యమరక్షోణిజవల్లీ! 25

వ. ప్రళయకాలంబున జగంబుల నిదురఁ బుచ్చు జగన్మాత నిట్లు నిదురఁ బుచ్చి దేవతాప్రమదాజనంబులు నిజనివాసంబులకుం జనియె నట్లు కాలంబు గడచు చుండ 26

## బాల క్రీడలు

* క. శైశవము దాటి, గిరిజ ప్ర
వేశించెను బాల్యమందు వేడు కలరఁగా
నాశలు మెల్లనఁ బొడమె, జ
లాశయమున లేచెడు చిఱు నలలకుఁ బోలెన్ 27

క. ఆటలఁ బాటలతో, స
య్యాటల సరసంపుమృదుల హాస్యంబులఁ బూఁ
దోఁటల బాటలలో, నే
పూటలు నాడుకొను తోఁటి బోఁటులతోడన్ 28

క. బొమ్మకు స్నానము వోయును
నమ్మతిఁ గాటుకలు వొట్టు సవరించియు, నా
బొమ్మ న్నెత్తికొని తిరుగుఁ
గమ్మనిపా లిచ్చి, నిదుర గరఁపుచు నుండున్ 29

ద్వి. బొమ్మలపెండ్లిండ్లు పొలుపుగాఁ జలుపు
నమ్మాయి లందఱ కాహ్వాన మిచ్చు
వియ్యాలవారికి వివిధవిధముల
నొయ్యారముగఁ గూర్చు నొనరైన వసతి
విందులు వినయాలు వేడుక లన్ని
మందయాన యొనర్చు మందముదమున
వంటలు వార్పులు, వరుసఁగాఁ బిండి
వంటలు వండుచు వడ్డనల్ సేయు
భోజనముల నెల్లఁ బుష్కలము, నిడి
భాజనముగ నాకువక్కల నిచ్చు
క్రోఁతికొమ్మాటలు గొమ్మలఁ గూడి
క్రోఁతులతోడను గొమ రొప్ప నాఁడు
వోమనగుంటల నొయ్యారి యాడి
యామకొనుచు నావుల* నన్నింటి గెల్చు
నింతులతోఁ గూడి యింపుగాఁ బూల
బంతులాటల నాడు బాల నేఱుపునఁ
గట్టెగుత్తాలపై గౌరి పర్వెత్తు
నట్టె చెలులు నంద అలసి వెన్కఁ బడ
జలకేళులను జల్పు సలిలాశయముల
జలవిహంగములతో సకియలఁ గూడి
పిరిఁబోఁడి పాదాలు వినువీథిఁ దాఁక

* ఆవు = నాలుగుకాయల సముదాయము.

నురువేగమునఁ దిఁగెయూయల లూఁగు
గ్రచ్చకాయలయాటఁ గనకాంగి చెలులః
మెచ్చఁగ గెల్చును మేటిపందెముఃఁ
దొక్కుడుబిళ్ళాటఁ దోయజగంధి
జక్కఁగా నాడు నుత్సాహ మొప్పఁగను
డాఁగిలిమ్రుచ్చులు తరళాక్షి యాడు
దాఁగదు దొంగఁగఁ దల్లిచాటునను 30

క. తామరకొలఁకుల యందునఁ
దామరసము దొడఁగు మొగ్గతళుకు లెసకున్
దామరసాక్షి యురంబునఁ
దామరసముకుళము లనఁగ స్తనములు వొడమెన్ 31

క. నీరజమిత్రునిఁ గాంచిన
నీరజములు గాంతు లీని నిగనిగ మెఱయున్
నీరేజనేత్ర పట్టెడు
నీరాజనకళిక లనఁగ నిటలాక్షునకున్ 32

క. పంచోషఃకాలంబునఁ
బంచమనాదమును గళవి పరభృతములతోఁ
బంచాస్యుని కీర్తులను వి
పంచిని, భూపాలమునను బాడుచు నుండున్ 33

క. బంగరుపంజరములలో
సింగారంబులు సెలంగఁ జిలుకలఁ బెంచున్
గంగాధరునామములఁ గు
రంగసునయన ప్రియము లలరఁగఁ బలికించున్ 34

క. పూవుల మొక్కల నాటును;
సేవించుచునుండు వాని; స్వీయకరములన్
బూవులమాలలను మహా
దేవున కర్పించి, లాల్చి తృప్తిం జెందున్ 35

క. పచ్చికలేజొంపము లం
దిచ్చును హరిణములకుఁ గడునింపుగ, నవియున్
బుచ్చుకొనుచు, హరిణేక్షణ
మెచ్చుచు నీక్షించుఁ గనులు మిలమిల మెఱయన్ 36

క. నాదకళాసహితంబుగ
వేదపురాణంబులను వివిధశాస్త్రములన్
సాదరముగ గురువుల నా
రాధించుచు సకలవిద్య లభ్యాసించున్ 37

సీ. అతిథుల భక్తితో నాదరించుచు వారి
యాశీర్వచనముల నందుకొనును
జుట్టాలఁ జక్కాలఁ జూచు మక్కువతోడ
వారల ప్రేమలఁ జూఱఁ గొనును
భృత్యవర్గంబులఁ బ్రియమునఁ బ్రోచును
విశ్వాసములఁ గొను వేడుకలర
బీదసాదల దయవీక్షించి పోషించు
దీవనలనుఁ గొని తేజరిల్లు

తే. తల్లిదండ్రులఁ జూచును దైవములుగ
గురుజనంబులయెడ భక్తి గుదిరి యుండుఁ
బిన్నలందున వాత్సల్యవిధిని దనరు
ధరణి బాలికలకును నాదర్శముగను. 38

సీ. సకలప్రకృతిఁ గలసౌందర్యములను, ధ
రణిఁ గొని యేతెంచు రతి యనంగ
సకలసౌభాగ్యముల్ సమకూర్చుకొని, తా ని
లకుఁ దీసికొనివచ్చు లక్ష్మి యనఁగ
సకలాన్నచయముల సవరించుకొని వచ్చి
స్ఫూర్తిఁ బంచెడు నన్నపూర్ణ యనఁగ
సకలవిద్యారహస్యంబుల నవనికిఁ
బ్రకటింపవచ్చు భారతి యనంగ

తే. సకలనిధులు ప్రసాదించు సంద్ర మనఁగ
సకలక్షమలకుఁ బ్రతిరూపి క్ష్మా యనంగ
సకలవాంఛ లీడేర్చెడుస్వర్గవి యన
సకలశక్తులప్రతినిధి జగతి గిరిజ. ౩9

తే. త్యాగబుద్ధినిఁ దా జలదం బనంగ
సర్వసమభావ మందున సవిత్రుఁ డనఁగ
శుద్ధతేజంబునందున శుచి యనంగ
నొప్పుచుండెను నొప్పులకుప్ప గజ 40

తే.మా. శుక్లపక్షంపుఁజంద్రుని సొంపు మీఱి
బాల పెరిఁగె దినదినప్రవర్ధమాన
యై పదాఱేండ్లు నిండిన యౌవనమునఁ
చంద్రుఁడా ! నీవు పొడువకు చాలు నేనె
పొడిచెదను జూడు మనియెడు పొలుపు గలిగి
లలన పెరుఁగుచు నుండె విలాసినులును
నాయమకు సాటి యగు వార లవనిఁ గలరె ?
తనకుఁ దానే సమం బని తలఁచు చుండ. 41

సీ. కరుణారసాపాల, కల్యాణగుణజాల
కమనీయసుకపోల ఘనసుశీల
విరిఁబోణి శుకవాణి పృథుసైకతశ్రోణి
కంజాతనిభపాణి ఘనసువేణి
చేమంతి పూబంతి సీమంతిని సుదంతి
వాసంతి యా యింతివార్క్షవంతి
సుకుమారి సువిచారి సూరిహృత్సంచారి
కమలారిముఖి మేనకాకుమారి

తే. దానమున కసమాన, కందర్పబాణ
గానమాధురిఁ బరభృత్సమాన, బాణ
సూనృతానూన, శుద్ధయశోనిధాన
మానవతి హంసయాన యా మందయాన 42

చ. కలికిమిటారి నెమ్మొగముఁగాంతులు గానఁగలేక క్రుంగు నా
కలువలజేఁడు, నా సొగసుఁగన్నులు గోరియ యొంటికాలిపై
నిలిచి తపంబు సేయునట నీటను బద్మము, జంటితేనియల్
పలుకులు రామచిల్కలకుఁ బల్కులు నేర్పెడు నొజ్జబంతులై 43

తే. నడువ నేర్చెను హంస లా నడకలు గని
నవ్వ నేర్చెను బువ్వ లా నవ్వులు గని
యాడ నేర్చెను నెమిళు లా యాటలు గని
పాడ నేర్చెను బికము లా పాటలు విని. 44

మ. మొగముం జందురునవ్వువెన్నెలల సమ్మోదంబుతోఁ గాంచి సొం
పుగఁ గల్వల్ వికసించు,హర్షమున నుప్పొంగుఁ సముద్రంబుగా,
గుగఁ దచ్చంద్రికఁ గ్రోలి వెన్నియలపుల్గుల్ గాంచునంతృప్తిఁ గెం
జిగురుల్ మొగ్గలు దాల్చు సంతసమునన్ జెట్లున్ లతాసంజముల్

సీ. మధురఫలంబుల కధరామృతపుఁదీపుఁ
గొంచెకొంచెము ప్రసాదించు నౌర !
చిగురుజొంపములకుఁ జిగురుకేల్మృదులతఁ
గొంచెకొంచెము ప్రసాదించు నౌర !
యళులకు సొగసైనయలివేణినీలిమఁ
గొంచెకొంచెము ప్రసాదించు నౌర !
పుష్పచయములకుఁ బూమేనిగంధంబుఁ
గొంచెకొంచెము ప్రసాదించు నౌర !

తే. మోముఁదళుకులు దామరపూవులకును
నయనములసోయఁగము హరిణంబులకు
మందయానంపుటందంబు మదకరులకుఁ
గొంచెకొంచెముగాఁ బ్రసాదించు నౌర ! 46

వ. ఆ శోభనాంగి యంగాంగవైభవం బింకను నెట్టి దనిన 47

సీ.మా. పంకజముఖి ముఖపంకజసుధఁ ద్రావ
ముగ్ధాళిపంక్తులు మూఁగు, మూఁగి
చంపకనాసిక చంపకభ్రమ గొల్ప
భయముచేఁ దుఱ్ఱునఁ బాఱిపోవుఁ
జిగురుమోవిని మోవిచిగురు నాసించుచుఁ
బికములు మెసవను వెళ్ళు, వెళ్ళి
తూపులుచూపులు తూపు లన్ భ్రమ గొల్ప
భయమున బుఱ్ఱునఁ బాఱిపోవు,
బింబాధరాధరబింబఫలము మెక్కఁ
జిలుకలు గములుగాఁ జేరు, చేరి
భ్రూధనుర్యుగమును బోడఁ గాంచి వింద్లమ
భయమున సఱ్ఱునఁ బాఱిపోవుఁ

జంద్రాననాననచంద్రచంద్రికలఁ జ
కోరకంబులు గ్రోలఁ గోరు, కోరి
కలువకంటికనులఁ గలువజంటను గాంచి
యీర్ష్యతో జిఱ్ఱున నెగసిపోవుఁ

ఆ.వె. చెక్కుటద్దములను జేరిన లోలకుల్
లోలకులను సిగ్గుపాలు చేయు
కంబుకంఠి కంఠగరిమగని భ్రమించి
కంబువు తిరుగుళ్ళు గలిగి యుండు. 48

క. నవయౌవనపుం గాంతులు
నవనీమండలము గప్పి యాకాశమునన్
దివిఁ దాఁకఁ బ్రాఁకి చన నా
ప్రవిమలశశి దాఁగె మేఘపటలము నందున్ 49

## పార్వతి శివు నారాధించుట

వ. ఇట్లుండ నొక్కనాఁటిరేపకడ 50

ఉ. వచ్చెను నారదుండు హిమవంతునియింటికి, నారదంబునం
జొచ్చెను బార్వతీగృహము, శోభలఁ గాంచుచు వైభవంబులన్
మెచ్చెను, గన్నె మ్రొక్కుదయ మేలొనఁగూర్చెడు దీవనంబులం
దిచ్చెను, జెప్పగాఁ దొడఁగె నింతికి దేవరహస్య మెంతయున్

ఉ. ఓ సతి ! విభుండు శివుఁ డుజ్జ్వలదీర్ఘసమాధి బాహ్యపుం
ధ్యాసలు మాని నిన్గురించి ధ్యానము సేయుచు నుండె స్థాణుఁడై
యా నమభావు, శంకరుని, నా కరుణారససింధు, శర్వుఁ గై
లాసనివాసు, నీశు నిటలాక్షుఁ దపంబున గెల్వు మంబరో ! 52

హరిగతి. తపమువలన సాధింపుము గంగా
ధరునికటాక్షము సంపూర్ణంబుగఁ
దపమున సాధ్యముగానిపనియు నీ
ధరణిని లేదు సుమి యథార్థంబుగఁ
దపమువలన నీ జనకుండు ధరా
ధరనాథుం డై వెలసె జగంబునఁ
దపమువలననే మేనక నిన్ దన
తనయగఁ గనఁ గల్గె నదృష్టంబున. 53

తే. 'ఓం నమశ్శివా'యేతి సముజ్జ్వల మగు
శైవపంచాక్షరీమంత్రజప సుదీక్ష
నిచ్చి, జపియించు మనె మంత్ర, మీప్సితార్థ
సిద్ధి లభియించు నని చెప్పె సిద్ధవరుఁడు. 54

మత్తకో. దేవతామునివర్యుఁ డి ట్లుపదేశ మిచ్చి యథేచ్ఛగన్
దేవమార్గముఁబట్టి వెళ్ళెను దివ్యవీణను మీటుచున్,
భావమందు మహేశుపైఁ గలభక్తిపెంపునఁ బార్వతీ
దేవి శంభుని పాదపద్మవిధేయురాలయి దీక్షతోన్ 55

సీ. బ్రాహ్మీముహూర్తాన భవుని స్మరించుచుఁ
బర్వతపుత్రి శర్వాణిలేచుఁ
బంచమస్వరమునఁ బాడి మేల్కొలుపులు
మేనకాసుత శివు మేలుకొలుపుఁ
బ్రవహించు శుద్ధప్రవాహజలంబుల
స్నానముల్ గిరిబాల సల్పు, శుద్ధ
ధవళవస్త్రయుగమ్ము ధరియించి, మొగమునఁ
బసుపుఁగుంకుమల నపర్ణ వాల్చు

క. తిను, సాత్త్విక మాహారము
మనమున శివగుణము లెపుడు మననము చేయున్
గనుఁ దెఱచియుఁ గను మూసియుఁ
గను, నను శివరూపమే సకలజగమందున్ 68

శా. సాయాహ్నంబులఁ బార్వతీసతి మహాశ్రద్ధాళువై జాహ్నవీ
తోయస్నానము లాడి, ధ్యానజపముల్ దోరంబుగాఁ జల్పి య
మ్మాయాతీతు సహస్రపద్మముల సమ్మానించుచుం బ్రార్థనల్
సేయున్ స్వీయఁగఁ జేసికొమ్మనుచు నా చిన్నారి చిద్రూపునిన్

ఉ. మంగళహారతుల్ బహునమస్కృతులం బొనరించి మించుచున్
నింగిని దేవవాద్యముల నేర్పు చెలంగఁగ మేళవించి మా
తంగి వినృత్యగీతములఁ దన్మయుఁ జేయుచు జోలపాడి ని
స్సంగుని నిద్రపుచ్చి తనశయ్యను జేరు శివున్ స్మరించుచున్

వ. ఇట్లు కాలంబు గడచు చుండు నంత 69

ఉ. తారకరాక్షసేశ్వరుఁడు దారుణ మైన తపంబుచే నసా
ధారణ మొప్ప బ్రహ్మవరదానము లొంది, యజేయుఁడై మహా
వీరవరోగ్రుఁడై యమరవీరుల గెల్చి సురేంద్రుసంపదల్
చూఱఁగఁ బుచ్చె నా దనుజహారుఁడు, ధర్మవిదూరుఁ డయ్యెడన్

తే.గీ.మా. ధనములను గొల్లగొట్టుట, దారలఁ జెఱ
పట్టి యవమతి చేయుట, పదమునుండి
వెడలఁగొట్టుట యాదగా వెక్కసమగు
దనుజనాథుని బాధలు తాళలేక
దేవతలు గూడి యా బ్రహ్మదేవుఁ గూర్చి
నిటలఘటిత కరకమలపుటులు గాఁగ

మొఱలువెట్టఁ దొడంగిరి ముందు నిల్చి
'శరణు శరణు పితామహ! సాధుపక్ష!
దుష్టుఁ డగు తారకుని బాధ దొలఁగఁ జేయు
తెరవు నారయఁ గదె, యార్య! దీనరక్ష!
యభయమును గూర్పు' మని వేడ ననియె బ్రహ్మ
'శంకరునిపుత్రుచే వాఁడు చచ్చు వినుఁడు
స్థాణుఁడై నిల్చినాఁడు సదాశివుండు
వానిహస్తంబు పట్టఁ బార్వతి దపించు
వారిఁ గూర్పంగవలయు నుపాయ మరయుఁ
డనిన విని దివిజులు సన నమరగురుఁడు
'నరయ నిక్కార్యమున విజయము గొనుటకు
మన్మథుం డొక్కఁడుండు సమర్థుఁ డన, న
నిమిషపతి పుష్పబాణు నా నిమిషముననె
తోడఁ గొనిర మ్మటంచును దూత నంపె 71

## కామదహనము

ఉ.మా. భూతలమందు నాకు సరిపోఁ దగు జో దెవఁ డంచు మారుఁ డో
చేత సుమాస్త్రముల్ మఱొకచేతను నిక్షుధనుస్సు దాల్చుచున్
జేతనమౌనుఁ గాదె తనచేత నచేతనపృథ్వి యంచు సం
ప్రీతమనస్కుఁడై, రతినిఁ బ్రేమల ముంచుచు, విఱ్ఱవీఁగుచున్
నాతతదర్ప ముట్టిపడ నాననమందునఁ, బ్రేయసేసుధో
పేతసుభాషణల్ శ్రవణపేయములై చన, వక్త్రచంద్రసం
జాతవిశుద్ధచంద్రికల సారెకుఁ గన్నులఁ గ్రోలుచున్ సదా
చేతనులయ్యు దంపతు లచేతనులో యన నొప్పు, దేవతా
దూత యొకండు కన్నులకుఁ దోఁచెను దోఁచెను దస్మయస్థితి

న్నాతఁడుఁ బొన్కపుంబుడుక నైతి నటంచుఁ దలంచియున్
నహో !
చాతకదాహశాంత మగుఁ జక్కఁగ వర్షజలంబుచే, సుర
వ్రాతభయంబు నీ దగు కృపారసవృష్టిని దీఱుఁ గీర్తిప్ర
ఖ్యాతులు నీవె యా త్రిపథగామినివోలెను ముజ్జగంబులన్
హేతువు నీవ సృష్టికి నహీనపరాక్రమశాలి వో మనో
జాత ! సురేంద్రుఁ డంపె నినుఁ జయ్యనఁ దోడ్కొని ర
మ్మటం చన
న్నాతురగామి వై పయన మయ్యె నతం డమరేంద్రుపాలికిన్

క. వచ్చితివా ? రా ర మ్మని
మెచ్చుచు నాహ్వాన మొసఁగి మేలిమిపీఠం
బిచ్చెను బ్రేముగ సురపతి
ముచ్చట లాడంగఁ దొడఁగె మోదము మీఱన్ 73

క. కుశలమె ? మన్మథ ! రతికిన్
గుశలమె ? మధుపములకుఁ జెఱకుంధనువునకున్
గుశలమె ? సుమబాణములకుఁ,
గుశలమె శుకవాహనమునకు, వసంతునకున్ 74

చ. చతురుఁడ వీవె దంపతులసన్నిహితం బొనరించు, వారి న
న్మతులను బ్రేమపూరిత మొనర్చి, రతీసుఖసత్ఫలంబు సం
తతితతిఁ గూర్చి సృష్టివ్యవధానము లేక చరింపఁ జేయు నీ
ప్రతిభ నుతింపఁగాఁ దరమె ? బ్రహ్మకు వాణికి శేషమూర్తికిన్

సీ. బ్రహ్మజిహ్వాగ్రము భారతీనిలయమై
మహినొప్పు నది నీదుమహిమ గాదె ?
కమలాక్షుహృదయము కమలకుఁ బీఠమై
మహి నొప్పు నది నీదుమహిమ గాదె ?

భవునియర్థాంగ మంబారూపమై తగి
మహి నొప్పు నది నీదుమహిమ గాదె ?
ఇంద్రునివామాంక మింద్రాణి వాసమై
మహి నొప్పు నది నీదుమహిమ గాదె ?

తే. యీవు సృష్టిస్థితులఁ గర్త వీశ్వరుండ
నీవు లే కున్న లేనివ యీ జగమ్ము
లేమని నుతింతు ? ముల్లోక మేలుకొనుట
కీవ సామర్థ్యము గలాఁడ వెంచి చూడ 76

తే. ప్రేమవశ్యంబుగాదె ? యీ పృథ్వి, ప్రేమ
నీవశంబయి యున్నది నిజము, నీవు
దలఁపఁ గానట్టి కర్జమ్ము గలదె ! యిపుడు
దేవతాకార్య మొకటి సాధింపవలయు 77

వ. అని పొగడుచున్న శచీపతికి రతీపతి యిట్లనియె. 78

ఉ. ఇంత ఘనంబుగాఁ బొగడ నేల ? ననర్హుని నన్ను మీరు నేఁ
బంతముఁ బూని చెప్పెదను ప్రాణము లొడ్డియు నైన నింక మీ
చింతితకార్య మీ క్షణము చేసెద సుండు ! స్వధర్మమందు ధీ
మంతులు దేహమున్ దృణసమానముగాఁ ద్యజియింత్రు గాదె, నాక

క. తారకుఁడు శివకుమారుఁ డు
దారునిచేఁ జచ్చు నను విధావపరము, త
త్కారణు లగు శివభక్తుఁ
గారుణికులఁ గలుపు మిదియ కార్యము సుమ్మీ ! 8)

చ. అని యిటులామహేంద్రుఁ డపుడానతి సేయఁగ మన్మథుండు, శం
భునకును బార్వతీసతినిఁ బొల్పుగఁ గూర్చెద నంచు గర్వియై
తనబలగంబుతో శివునిఁ దాఁకను సిద్ధపడంగఁ జూచి, యా
తనిసతి యాఁపి, యుగ్రుని ప్రలాపము గూర్చి పల్కె ...

క్రౌంచ. శంభునితోడఁ వైరముఁ బూనఁ జనదు చనదు, మనవిని వినుమా, నా
శంబును గోరఁ వహ్నిని దూరఁ శలభము మసియయి భువి పయిఁ గూలఁ
సాంబునిపైనఁ ఇల్పుటి దాడుల్ చలుపనుహరి నునికొలుపుట పోలఁ
గుంభినిపై యుగ్రుఁడు పోరఁ గుబుసము విడిచిన యురగము సుమ్మా! 82

క. మోహము లన్నింటిని స
మ్మోహింపం జాలు సర్వమోహను, స్థాణుఁ
మోహితుఁ జేసెద ననుట, వి
మోహము, సాహసము మఱియు మూర్ఖతగాదే! 83

మ. త్రిపురంబుల్ వడఁగాల్చి మించి, ఘనకీర్తిం గాంచె లోకానఁ, బ్రే
తపతిఁ గొట్టైను, పాహి పాహి యనఁగాఁ దప్పుఁ క్షమించెం గదా!
విపరీతంబును దెచ్చు భూతపతి విద్వేషంబు, నా శూలికి
న్నపరాధంబు **తలంప** నగ్ని నొడి కాహ్వానించుటే యౌ సుమా!

వ. ఇట్లెంత చెప్పిన నొప్పక పుష్పవిల్తుం దప్పదతిం దిరస్కరించి 84

క. కయ్యము వల దని పట్టిన
చెయ్యిని విదళించి వెడలె శీఘ్రగమనుఁడై
యయ్యో! యయ్యో! యని రతి
కుయ్యో! మొఱ్ఱో! యటంచుఁ గూతం జనియెన్ 85

వ. అట్టియెడ. 86

### హరిగతిరగడ

కంతుఁడు ముందు వసంతునిఁ బంపఁగఁ గానన మంతఁ జిగిర్చెను
జూచెను
గాంతులు మించెఁ దపోవనమున వనకాంతకు సొగసులవెన్నెల
గాసెను
గంధమ్ములు సుమములు విరఁజిమ్మెను గంధవహుఁడు
పరిమళముల మోసెను
మందమందముగఁ బవనుఁడు వీచెను మలయానిలుఁ డాహ్లాదము
చేసెను
బువుఁదేనియలను ద్రావుచుఁ గ్రైపునఁ బుష్పంధయములు ఝు
మ్మని మ్రోసెను
జివ్వరులు ఘుజియించుచు మైకమ్మున సిరికోకిలలు కుహూ యని
కూసెను
నెమిళులు పరవశమున నానందపునృత్యము చేయుచుఁ గేకలు
వేసెను
గమలిని లేఁదూఁడులు మెసవుచు శృంగారపుఁజేష్టల హంసలు
మురిసెను
జిలుకలు కిలకిలఁ బలుకఁ దొడంగెను సీతాకోకచిలుక లటు
వెలసెను
కలికి గిరిజ గని కలవరపడె గంగాధరుఁ డెంతకుఁ గదలక
మెఱసెను
వెలయ వసంత నకాలవసంతము విలసిల్లిన శృంగారవనంబున
సలలితముగ మదనుఁడు సొచ్చియు సంచార మొనర్చె
మహానందంబున 87

శా. ఒయ్యారంబుగఁ బ్రేమదేవత కడున్నుల్లాసిహియై కాంచుచు
న్నయ్యారే ! యిది నందనోపవన మౌ నంచుం బ్రశంసించుచున్
వెయ్యాశైననుపార్వతీశివులకుం బ్రేమల్ చిగుర్పంగ నే
కయ్యంబైనను బువ్వుఁగోలలను శృంగారించి కారించెదన్ 88

వ. అని ప్రగల్భోక్తుల నాడుచు సర్వసన్నద్ధుండై యున్న యవసరంబున. 89

చ. సదమలభక్తితో శివునిసన్నిధి బాల ప్రదక్షిణంబులన్
ముదమునఁ జేసి పాదములు మ్రొక్కి నుతించుచు గంధపుష్పముల్
సదయుని కర్పణంబుగ నొసంగి, ప్రియంబున 'స్వామి !నాకు నీ
హృదయమునం దొకింత స్థల మి మ్మని వేడుచు నిల్చునంతలోన్ 90

సీ. మారుఁడుమామనోహారి కై సుమసుకు
మారిని గౌరినిఁ జేరి నిల్చెఁ
జిత్తజుఁడద్రిజాచిత్తముతోఁ గూడి
యలిగుణంబుధనువు నమరఁ జేర్చె
నిక్షుబాణాననుం డిక్షుచాపంబు,లో
లేక్షణబొమలతో నెత్తి పట్టె
సుమనాస్త్రుఁ డపుడు కుసుమశరంబును వింట
సుమతన్విచూపుతో జో డొనర్చె

ఆ. కాముఁ డపుడు లాఁగె కామదమనుసౌమ్యవీక్షణంబుతోడ వింటినారి
మనసిజుండు హరునిమనసు నుమాదేవిమనసుతోడ లక్ష్య మొనరఁజేసె 91

తే. ఫాలలోచనుపైఁ బుష్పబాణుఁడుఁ బువుఁ
గోల వేయఁగఁ జూనినఁ గొంచలపడి
మనసు చల్లడ మందఁగ మదనవికృతి
నొడలు జలదరింపఁ గనుల్ శివుఁడును విచ్చి. 92

హరిగతి చూచెను గిరిజాసుదతిని శంభుఁడు సొగసులు గులికెడు కలికి
రగడ. మిటారిన్

గాఁచిన బంగరుమేనను మెఱసెడు కనకాభరణను మదనుకటారిన్
బూచిన తామరమొగమున వెల్గు ప్రఫుల్లోత్పలసమ సుందరనేత్రన్
జాఁచినకరములఁ జేకొని యంకస్థలమునఁజేర్చెను ముద్దుఁగాత్రన్
వెంటనె కామవిరోధి యిదే మని వీక్షించెను దనలోన న్వివశుఁడై
తుంటరి యెవఁడీ మోహముఁ గూర్చెను తుదముట్టించెద నని
నిశ్చయుఁడై
కంటక సమమగు కాఁపురమునకున్ గారణ మని యక్కాంతను
డించెన్
దుంట విలుతుపనియే యిది యని యా దోషిని వెదకుట కుద్యో
గించెన్ 93

క. నిగ్రహము భంగపడ, న
త్యాగ్రహమునఁ గలయఁ జూచి యగ్రమునందు
న్నుగ్రుఁడు, మదను నహంకృత
విగ్రహునిం గాంచి విప్పె విషమనయనమున్ 94

హరిగతి కాలానల సంభూతజ్వాలలఁ గా దను ఫాలనయనసంభవముల్
రగడ. గీలలు గని ముజ్జగములు వడఁకెను, గేలు మొగిడ్చెను ఋషి
మునిగణముల్
బేలుపడిరి, పార్వతి యాపెచెలులు, భీతి వసంతుఁడుఁ బాఱెఁ
బిరపిరన్
జాలువోక యనిమిషులును భయమునఁ బాఱిరి తమ తమ దారి
బిరబిరన్

మ.కో. కాలె శంఖునికంటిమంటను గాముఁ డొక్కక్షణంబునన్
గూలె, హా ! ప్రియ ! యటంచును గుప్పయై రతి నేలపై
దూలెఁ బార్వతి, తప్పి మన్మథుతూపు తనయెదఁ గ్రుచ్చఁగన్
ఫాలనేత్రుఁడు లేచి వెళ్ళెఁ దపంబు భంగముగా రుషన్ 96

వ. అప్పు డారతీదేవి. 97

ఉ. ఇట్టుల మూర్ఛ దేఱుకొని యేడ్చుచు వక్షమునన్ శిరంబునన్
గట్టిగ మోఁదుకొంచుఁ దనకర్మను దూఱుచుఁ బొర్లుచుం జితిన్
బొట్టను బెట్టికొంటి నినుఁ బోవు గదా యని మొండిప్రాణముల్
గట్టివి, బండనై బ్రతుకఁగా వలెనా ? యని విహ్వలాత్మయై. 98

హరిగతి. ఏకాకిని, కాకిగ నీ విధమున నే బ్రతుకఁగ వలెనా ? హతవిధినై
నా కిఁక దిక్కెవ రెందులఁ బోదు ననాథను నాథాదుర్గమపథినై
రాకాచంద్రునిఁబోలు ముఖకళలు, రాజీవనిభ నయనములతళుకుల్
హా ! కనఁబడవా ?, వీనులఁబడవా ? యమృతము లొలికెడు
తీయనిపలుకుల్. 99

క. కరముం దుఃఖాబ్ధి మునిఁగి
దరిఁ గానక తనదుపతినె తత్పరమతియై
పరిపరివిధముల నీవిధి
స్మరియింపుచు రతి విషాదసాగర మయ్యెన్ 100

వృషభగతి. ఎంత చెప్పిన వినక చేసితి వీశుపై బాణప్రయోగము
రగడ నంత మైతివి తాప దెట్టులు? హా! మనోహర ! నీవియోగము
పంత మే మయ్యెనుర ! ప్రేమకు వశుని జేసెద హరుని నంటివి
యంతకుని వశమైతి వింద్రుని స్వార్థబుద్ధినిఁ జెవిని గొంటివి

యన్నెమును బున్నెము నెఱుఁ గ వీఁక యన్న మొడిసెను నీకు
నేడ్పులు
నన్నముగ నా కై విధించితి వయ్యయో ! నిటూర్పు గాడ్పులు
నెన్నఁడును నెఱఁగాయ నంటివి యెందు కీ బూటకపు మాటలు
నన్ను విడిచితి వయ్యొ ! మిగిలెను నాకు నీ రోదనపుఁ బాటలు
ప్రేమలను జిగిరించి నిజముగఁ బ్రేమదేవత వైతి విక్కడఁ
బ్రేమలను నింపితివి యెల్లెడఁ బ్రేమలకుఁ దా విప్పు డెక్కడ ?
నామరూపములు విడిచితి, నీ నాతి నెవతికి నప్పగించితి ?
కామదేవ ! విదేహివై నిష్కాములకు హర్షమ్ము నించితి. 101

వ. అని, శోకించుచు సురలపై నతిగి కోపతాపంబులు దుఃఖము నాక్రమించి క్రమంబున నతిక్రమించిన. 102

శా. నా మాంగల్యధనంబు దోఁచికొని యానందాబ్ధి నింకించి, యే
క్షేమంబుల్ గనువారొ ? యీ సురలు ? వీక్షింతుం గదా!దేవతా
ధామారత్న సుమంగళీత్వమును సౌభాగ్యంబు రక్షింపఁగన్
సామర్థ్యంబు గలార రెవ్వరొకొ? నా శాపాగ్నుల న్నోపఁగన్ 103

ఆ. శోకరోషము లవి యేకమై పెనఁగొనఁ గాళిఁ బోలురతిని గని
సురపతి
దేవపథమునుండి దిగివచ్చి బిరబిర సావధానపఱుపసాఁగె నిట్లు

చ. నిజముగఁ బావఁబోఁడు, విధినిర్వహణం బనుహోమకుండమం
దజరులు మెచ్చ, స్వీయతను వాహుతి చేసి, పరోపకారమన్
యజన మొనర్చెఁ గీర్తియను యజ్ఞఫలంబును బొంది, నీ విభుం
డజశివకేశవాదిసుర లల్లదె యుత్తురు దీవనల్ దయన్ 105

వ. అప్పుడు సకలసుర లనుగ్రహించి కేశవపురస్సరంబుగా రతి కిట్లనిరి. 106

మానిని. నీ విభుఁ డెప్పుడు నీకుఁ గనంబడు నిశ్చయరూపమునందు,
నహో!
భావమునందున లోకులు వాని ప్రభావము మాత్రము గాంతు రహో!
యావల నాతఁ డనంగుఁడు భావజుఁ డంచు జగంబుల ఖ్యాతి
గొనుఁన్
నీ విఁక భేదము మానుము నీ పతి ని న్నిఁక నేలుచు నెప్డు
మనున్ 107

మ. అని యాశీస్సు లజాదిదేవత లిడ 'స్సన్నన్న నిద్రా!' యటం
చును లేచెన్ సశరీరుఁ డై మదనుఁ డచ్చోఁ జోద్యముం
గొల్పుచున్
దనయిల్లాలికి మాత్రమే యగుపడెం దర్పంబు మీఱంగ, వి
చ్చెను దుఃఖాంధతమస్సులున్ రతిసతీచేతోముఖాబ్జంబులన్ 108

మానినీవృత్తగర్భ హరిగతిరగడ

ప్రాణము బొందినఁ బొందిన యట్టులు స్వస్థతఁ జెందె సుహర్షిత
యై, రతి
ప్రాణసమానునిఁ గౌఁగిటఁ గ్రుచ్చెను బాష్పములం బుల
కాంకితయై, సతి
మానినిపైఁ గురియించిరి యా సురమాన్యులు పూవులవర్షముల
న్నొగి
మౌనులు దీవన లిచ్చిరి యిట్లు సుమంగళి వై కనుహర్షములం,
దగి 109

క. అన నిట్లు రతీరమణుఁడుఁ
దనరఁగ దివిజప్రసాదిత శరీరుండై
వనితామణి తనదుసతీ
మణి గుణమణియగు రతీరమణిఁ గని యనియెన్ 110

విజయవృత్తరూప తురంగవల్గనరగడ

ఏఁడి పరమశివుఁడు ? గిరిజయేది ? వారు కలిసినార ?
కూడిపోయినార ? సురలకోర్కి పూర్తి చేసినార ?
పాడుస్వప్నమందు నన్ను భగభగమని వచ్చి మంట
బూడిదగను గూల్చె మూర్ఛపోతి పీవు కంటిఁ గంట.
వీడ కున్నది భయ మింక వేపనముల వరున కొంత
చూడు మిదిగొ చెమటలు పొడసూపు చుండె దేహ మంత
నేడిచితివ ? బాష్పధార లిగిరెఁ జెంప గోముతోడఁ
బోఁడిమియును దప్పెఁ జిన్నవోయె ముద్దుమోముఁ గూడఁ
దోడుగాను భర్తనీకుఁ దోయజాక్షి ! యుండ, వాని
నీడయందు హాయి మీఱ నిదురపొమ్ము చింత మాని
నేఁడు మరల జంటగాను నిల్పె దేవతాఘటనము
జోడుఁ బాపు వారు గలరె ? చోద్య మిట్టిసంఘటనము. 111

వ. అంతట 112

విజయభద్ర రగడ

కాంత తనకాంతు బిగికౌఁగిటను నొదిఁగి ముఖ
కాంతు లిమ్మడి కాఁగఁ గథ చెప్పి ముద మందెఁ
గంతుఁడును దానిఁ గడు కౌతుహలమున విని
కాంక్ష దీఱఁగ సతినిఁ గాంచి హర్షముఁ జెందె.
సంతోషమున మనోసంభవునిఁ దోడు కొని
సంభ్రమముతోడ రతి చనె వీడి యీ భువిని
నింతకును దమకృషి ఫలించ లే దనుచు దుః
ఖించుచును సురలుఁ బయనించి చేరిరి దివిని. 113

వ. ఇట్లు నిష్కారణంబుగ శంభుని తెరువుఁ బోయి మనస్సం
భవుండు భ్రష్టుఁడయి నభవుం డంతర్ధానంబుఁ
జెందుటయుఁ గని యగ్గిరిజాభవాని యక్కజంపడి వెక్క
సంబున మిక్కిలి వగచుచు సఖి కి ట్లనియె 114

ఉ. వాటము దప్పి మారుఁ డిటు వచ్చుట యేలకొ? చాటుమాఁటుగా
నాటుట యేలకో? శివు, సనాతనుపైఁ దనపుష్పబాణముల్
బోఁటుల వీడి యప్పరమపూరుషుపైఁ దనపౌరుషంబులన్
జాటుటయేలకో? తెలియఁ జాలక యీట్లుట యేలకో యిటుల్?

క. ఇది యంతయు నా దుర్విధి;
వెదకించుట యెటులు? శివుఁడు వెళ్ళె నెటకు? నా
విధమును దెల్పెడు వారు వ
సుధపై నెవ రైనఁ గలరె? చూడుము చెలియా! 116

ఆ. గౌరి యిట్లు మిగులఁ గలవరపడుచుండఁ
జేరఁ దీసి పలికెఁ జేటి యిదిగొ!
చారవరులఁ బంపి జాడలు గొందు వి
చార ముడుఁగు మనిన శాంతి గొనక. 117

ఉ. శర్వుని జాడఁ గానక, విచారభరంబు సహింపలేక యా
పర్వతరాజపుత్రి తనపట్టును గట్టిగఁ బట్టి యింకఁ బై
సర్వము నీదె భార మని సాంబసదాశివు వేడుచుం దపో
నిర్వహణంబునందు ద్విగుణీకృతదీక్షవహించి యంతటన్ 118

పార్వతి తపస్సు

తే. తప మొనర్చెడు దననిశ్చితంపుఁగోర్కి యమ్మ కెఱిఁగింప నామె దుఃఖాతిశయము
విస్మయముతోడఁ బెనఁగొన వెఱ్ఱివోలె, క్షణము నిర్ఘాంతపోయి మూర్ఛగత యయ్యె. 119

తే. తెప్పఱిలి లేచిదగ్గఱఁ దీసి సుతను
ముంగురులు దిద్దు చామె చుబుకముపట్టి
కన్నులను నీరు నించి కంగారు పడుచు
బ్రతిమిలాడుచుఁ బల్కెఁ నా పడఁతి కిట్లు. 120

వృషభగతి. తపము సేయఁగ నేల నీ కిటు తామరసనేత్ర! సుకుమారీ!
విపినభూముల నిల్వఁగలవా? వెఱ్ఱి గాదు కదా! కుమారీ!
ప్రేమలందునఁ బెరిగినావు శిరీషపేశలమృదులగాత్రీ!
క్షేమకర మిది గాదు విను నీ చిత్తమును మరలింపు పుత్రీ!
వేదనలపా లయ్యెదవు బహువిధము లాయాసములు గలుగును
కా దనకు నా మాట విను మో కలికి నీకు సుఖములు చెలఁగును
తగ మసీషులు దేవతలు ఘనతత్పరత మనయింట నుండిరి
మగువ! నీ కోరినవరంబులు మంగళముగా నిచ్చు చుండిరి
కొదవ నీ కేమి గల దింటను? గొల్ల లష్టైశ్వర్యము లుమా!
యదిగో! నవనిధు లనవధులు నీ వనుభవింపఁగ నేరవు సుమా!
లేక లేకయె కల్గితివి విడలేము నీతోడిసహవాసము
కాఁకతీఱిన మునివరులకే కఠినవాసము వననివాసము
ప్రాణపతిఁ గోరెదవ, దివ్యులు పాదముల వ్రాలెదరు సురలును
జాణ! రత్నము వెదకఁగా రాఁజాలరా! రాజన్యవరులును 121

క. అని, తపము మాన్పఁ దివిరెడి
జననికి లోకజయిత్రి సమభావమునం
దనదు సమాధానం బిటు
వినిపించెను నిశ్చితముగ వినయము మీఱన్ 122

-:విజయవృత్తరూప తురగవల్గనరగడ:-

సాహసంబు చేసి ముందు సాఁగి పోవవలె జగతిని
వాహినీశుఁ గలయ నదులు వడివడిగను బోవు గతిని
దేహి సాధనమ్ము సేయ దేహబంధములు విడు సుమ !
మోహతిమిర మంతఁ దొలఁగి ముందు దారి గనఁబడు సుమ !

క. చలనమె జీవము, జీవమె
చలనం బిది సృష్టిసహజ సంస్థియుగున్
దెలియఁగ వలెనీ సత్యము
చలనముననె జీవయాత్ర సాఁగుచు నుండున్ 124

క. ఎ ట్టె ట్టని తలపట్టులు
పట్టుకొనిన నేమి ఫలము? భవ్యమతి ! కనన్
బట్టును విడువక సాఁగినఁ
బెట్టింగను వచ్చు సృష్టిఁ బేర్మి నిటు నటున్. 125

క. నడిచెడి నతనికి నూఁత
న్నిడి పరుగిడు నట్లొనర్చుచే నేర్పు సుమా !
నడిచెడు మానిసి నెప్పుడుఁ
బడఁగొట్టఁగ వలదు కాళ్ళ బడిత న్నిడుమన్ 126

క. భారతనారిగ శక్త్యవ
తారంబు గ్రహించె నిలను దానివలనఁ గా
నేరని కార్యము గలదే ?
సారమతీ ! నీకుఁ జెప్పఁ జాలను సుమతీ ! 127

క. పెద్దల దీవనలుండిన
నెద్ది యసాధ్యం బగు పని పృథ్వీస్థలిలో
వద్దనకుమ, నా విన్నప
మొద్దిక దీవించి పంపు మో యంబ యనన్. 128

క. నగధీర ధీరవాక్కుల
నగదార యధీర, వినుచు నయవచనంబుల్
మిగుల ననునయమున ననఁ దొ
డఁగెను దనతనయఁ గుఱిచి, యడఁచి దుఃఖంబున్. 129

విజయ వృత్తరూప విజయ మంగళ రగడ

ఘోరతపము సేయఁ బూన కోమలి తగ దమ్మ వినుమ!
కోరరాని కోరికలను గోరి కొనుట భావ్యమ యుమ!
శూరత యిది కాదు వినుమ సుద్ది తెలిసి మసలు కొనుమ!
చూరు నీళ్ళు వెన్నుఁగట్టఁ జొచ్చు ననుట చోద్యము సుమ! 130

తే. చేతఁ గా నట్టి పనులను జేయుటయును
దన కహిత మైన మాట లితరుల ననుట
మంచమున కంటెఁ గాళ్ళను మించి చాఁచు
టయును వర్జింప వలయు శిష్ట జనములకు. 131

త. వరునకునై తపంబు సలుపం బని యేమి? సరోరుహాక్షి! త్వ
ద్వరముఖ పంకజామృతపిపాసులు నాకనివాసు లెల్ల నీ
కరకమలంబు వట్టఁ బడిగాఁపులు గాయుచు నున్న వా రహో!
వరమణికాంతి సేయునె? నృపాల శిరోమణి యై వెలుంగఁగన్.

ఉ. మానుమ, మాను, మానుమ, యుమా! తప, మాతపవర్షశీతముల్
మౌనులు యోగివర్యు లసమాన సహిష్ణుల యోర్తురి, ఘోరమౌ
కాననభూమిఁ గ్రూరమృగఘాతుకసర్ప నికాయబాధలన్
మానిని! యెట్టు లోర్తు? సుకుమారశిరీషశరీర! కోమలీ! 132

ఉత్సా. శలభ మగ్నిఁ గోరి యందుఁ జావుకొఱకు నురికెడిన్
జలములోఁతుఁ గనక చొరుట సరసిజాస్య! చేటుకా
నలిననయన! వినవె యిపుడు నా హితప్రియోక్తులన్
ఫలము గనక కృషి యొనర్ప ఫలిత మింక దక్కునా? 134

మేలనగీతి. అనుచుఁ దల్లి వల్కునట్టి యాదరంపువాక్కు
వినుట కింపు గాక మిగుల వెక్కసంబుతోడ
తనకు శివునిఁ గెలువ నొక్క తపము శరణ మంచు
జనని యాజ్ఞ వడయఁ జెప్ప సాఁగె నిటుల నింక 135

క. చాతకపక్షులును దపము
చేతనె వర్షజలములను సేవించునె యా
రీతినిఁ జకోరకంబులుఁ
బ్రీతినిఁ గ్రోలంగఁ గల్గు వెన్నెలలఁ దగన్ 136

క. ధృతమతి 'యిక్కార్యము నం
గృతకృత్యవు గ' మ్మటంచుఁ గృపతో నాశీ
శ్శ్రుత మి మ్మని మాత యెదుట
నతమస్తక యయ్యె మానినతపద యంతన్ 137

క. తత్తఱపాటున మేనక
యుత్తరవాసమునఁ గనుల నొత్తుకొనుచు నా
చిత్తరి చిత్తము మరలుప
నిత్తెఱఁగునఁ జెప్పఁ దొడఁగె నేర్పున నెలమిన్. 138

సీ. కస్తూరి కుంకుమాగరు చందనాదులఁ
బూనాడి బూడిద బూఁతు వెట్లు?
జలతారు పట్టువస్త్రములను విడనాడి
నారచీరలు గట్టనేరు టెట్లు

హాటకనవరత్నహారాలు విడిచి రు
ద్రాక్షమాలికలను దాల్తు వెట్లు ?
ఘనచంచరీకాలఁ గావను నీలంపుఁ
గురులను జడలుగాఁ గూర్తు వెట్లు ?

తే. షడ్రసోపేత మైన భోజనము మాని
కందమూలఫలంబులఁ గుడుపు వెట్లు ?
హంసతూలికాతల్పంపు హాయి మఱచి
కటికనేలను బవళింపఁ గడఁగు వెట్లు ? 138

వ. అనుచు బాష్పాకులలోచన యై 139

ఉ. బిడ్డను గ్రుచ్చెఁ గౌఁగిటను, బ్రేమయు దుఃఖము పొంగ నేక మై
యడ్డపడెన్ వివేక మపు డశ్రుజలంబుల కానకట్ట యే
ర్పడ్డవిధంబునన్ మది తిరంబుగఁ దోఁచఁగ నిచ్చె దీవనల్
దొడ్డతనంబు మీఱఁగను దోయజగంధి, మనః ప్రపూర్తిగన్ 140

తే. క్షేమముగ వెళ్ళిరావమ్మ ! శీఘ్రముగనె
యీప్సితార్థము లెల్ల సిద్ధించుఁ గాక !
ప్రాప్తమగుఁ గాక ! నీకుఁ దపఃఫలంబు
శుభపరంపర లొనగూడ, శోభనాంగి. 141

వ. అను మాతాశీస్సులంగొని యుత్సాహంబున 142

క. కూరిమి జనకుని యంగీ
కారంబును బూర్ణముగను గ్రహియించి, జటా
ధారిని హరునిం గూఱిచి
ఘోరతపం బాచరించు కోర్కెయు మీఱన్ 143

క. చీరవసనములు దాలిచి
నేర్పుమెయి నక్షమాల నిలిపి కరమునన్
హారాదులఁ ద్యజియించియుఁ
గారిమితో జడలు దాల్చుకొని శివునిపయిన్ 144

క. ధారం బంతయు నిడి, సర
సీరుహముఖి హరుని స్మరణ చేయుచును వెసన్
గౌరీశిఖరంబునకుం
గౌరీదేవి పయనంబు గావించె నిటుల్ 145

హరిగతి. చలిమలపుట్టువు గట్టువిల్లుదయ సంపాదింప నిలు బయలుదేఱెన్
చెలియలు నిద్దఱు చేఁదోడుగ, హరు సేవింపఁగ విపినంబులఁ జేరెన్
మెకములు చూపులఁ బికములు కూఁతల మిళితపఱిచి
స్వాగతము వలికెన్
శు శారికలును సుస్వరములతో శుభము లరసి తమ ప్రేమల
నొలికెన్
సెలయేళ్ళర్ఘ్యాద్యుపచారంబులు సేసియు బహువిధముల
నర్చించెన్
ఫలపుష్పంబులు, పరిమళసుఖములు పాదపములుఁ బుష్కల
మర్పించెన్
మెచ్చునటుల శాఖావ్యజనంబుల మెల్లన వీచుచు శ్రమ పోకార్చెన్
బచ్చికబయళులు మృదులతమము లగు పాన్పులఁ బవళింపను
సమకూర్చెన్

వ. అంత నా మునిజనావన పావన మగు నా తపోవనంబు సొచ్చి

తే. అచటి మౌనివరులకు సాష్టాంగ వంద
నంబు లర్పించి నిలిచె వినయము వెలయ
వార లాశీర్వదించిరి 'వనరుహాక్షి !
శీఘ్రముగఁ గల్గు కల్యాణసిద్ధి' నీకు 148

క. కల్యాణి! యన్నిటం ద్వ
త్తుల్యుఁడు ప్రాణేశ్వరుండు దొరకును, గంగా
కుల్యంబునఁ దపమును సా
కల్యంబుగ నొనరఁ జేయు కంబుగ్రీవా! ౧౪౯

ద్వి. అను మునివర్యుల యాశీర్వచనముఁ
గొని, వారియాజ్ఞ గైకొని మేనకసుత
ముప్పూట స్నానాలు ముద మొప్పఁ జేయుఁ
దప్పక సంధ్యలఁ దగఁ బూజ సల్పుఁ
దనర పద్మాసనస్థ యగుచు నామె
యొనరఁ బ్రాణాయామ మొనరించుఁ, గొంత
నిక్కి దేహంబును నిలువుగా నుంచి
చక్కఁగా జపమును సాఁగించు చుండు
భ్రూమధ్యమున దృష్టిఁ బూని శంకరుని
నేమఱకయ ధ్యాన మే ప్రొద్దు సలుపుఁ
బంచాగ్నులను గ్రీష్మవాసరములను
నంచిత వర్షర్తువందు వర్షముల
మంచుతఱిని జలమధ్యంబునం ద
చంచలతపమునఁ జరియించుచుండు
నాఁకలియనదు పం డ్లందింపఁగఁ దిన
దాకలములఁ గొను నాహారముగను
బర్ణముల్ వదలి జీవనములఁ గొని, య
పర్ణాఖ్య నా లేమ ప్రఖ్యాతిఁ గనెను
గాలిఁ గ్రోలుచు నొంటికాలిపై నిలిచి

లీలగాఁ దప మవలీలఁ గావించు
వాయువు స్తంభించి బాహ్యంపు స్మృతులు
వాయుసమాధిని వహియించి మించు
ప్రమఁ గని కొండరాతి మాన్పు కొనుటకు
తాపసు మెకములు రాకన్నె మేను
చెట్టని భ్రమసి పక్షిగణము గ్రుడ్లు
వెట్టి జడలఁ గూండ్లఁ బిల్లలఁ జేయు 150

వ. అట్లా గిరికుమారి కఠోరదీక్షం గొనుచు నిశ్చలసమాధి స్థిత యగుచు వివిధానూనవిధానంబు లనుసంధించుచుఁ దపం బాచరించు నెడ గ్రీష్మాగమం బైన. 151

ఆ. పార్వతీతపోఽగ్ని భానుమండలమును
దాప మొందఁ జేయఁ దపనుఁ డంత
దాహ మోర్వ లేక త్రావె జలము లన
నాఱిపోయెను సలి లాశయములు 152

ఆ. మండి పడుచు భువిని మండింపఁ జేయుచుఁ
బ్రళయకాలవహ్ని పగిది మాఱి
వచ్చె నిటు రవి భవానిఁ దాఁకఁగ నైన
వృక్షములకు నోడి వెన్నుఁ జూపె 153

ఆ. ఆఁపఁ జాలక తన యవమానవహ్నిచే
నట్లపెనము చేసి యాకసమును
మాడ్చఁగాఁ దొడఁగె సమస్తలోకాలను
తహ తహ పడుచు నవి తల్లడిల్ల 154

క. ఎండలు మెండగు కొలఁదినిఁ
జండాంశుం డుగ్రుఁ డగుచు జ్వాలలు గ్రక్కన్
మండుచు గాలులు వీచను
చండిక గల యాశ్రమంబు చల్లఁగ నుండెన్ 155

క. ఎంతకుఁ దీఱని తాపపుఁ
జింతను శరణంబునొంది శివ దయ ననఁగా
శాంతింపఁ జేరె సంధ్యయుఁ
వంత ముడిగి పశ్చిమాబ్ధి భానుఁడు గ్రుంకెన్ 156

తే. లోకములు దాహ మడఁప నా లోకమాత
హృదయపుం జల్లఁదనమున నింపు గొలిపి
పాలసంద్రము దరవఁగాఁ బ్రభవ మొందు
వెన్నముద్దను బోలుచు వెడలెను శశి 157

తే. శీతలములు, సుధారసోపేతము లగు
కిరణములచే స్పృశింపుచుఁ గరువలికిని
శ్వాస లాడఁగ యవకాశసరణి దెల్పి
తాపమును బాపి ప్రాణిహితవును గూర్చె 158

క. రేయింబవళుల నిట్టు ల
హా ! యనిపించెడు మహోద్ధృతాతపతాప
ప్రాయము సడలె నన భువికి
హాయిగఁ దోఁతెంచె మేఘ మాకసమందున్ 159

తే. అద్రిసుత యిట్లు దీర్ఘసమాధి నుండు
కారణంబునఁ, దనపుణ్యకారణమున
వామదేవు నర్చించెడు భాగ్య మబ్బె
ననుచు వర్షర్తుకాంత యా వనము సొచ్చె 160

చ. దివి ఘనమేఘమాలికలు దివ్యసుగంధజలప్రపూర్ణముల్
నరకధార లొప్పెను, సహస్రఘటంబులతోడ దేవతల్
శివున కొనర్చు నట్టి యభిషేకమహోత్సవమో! యనంగ, శాం
భవినిఁ బరీక్ష సేయు దిగు భర్గజటాపటిముక్తగంగ నాన్ 161

క. గడగడ యుఱుములు పెల్లున
నెడ నెడ మిఱుమిట్లమెఱపు టంచులతోడన్
ఢఢఢా మ్మని పడు పిడుగుల
నెడతెగని సుఘోరవృష్టి యేర్పడె నంతన్ 162

తే. జగతితృష్ణ యడఁప జగచ్చక్షు వప్పు
లప్పుగా గ్రహియించియు నబ్ధినుండి
యొక్కపరి వానిఁ జెల్లించునో! యనంగఁ
గుండపోఁతఁగ వర్షమ్ముఁ గ్రుమ్మరించె 163

క. కట్టలు దెగెను సరస్సులు
కట్టలు మించికొని పాఱఁగా సాఁగె నదుల్
గట్టిడి దాటెను జలధులు
నెట్టిగతియు నైన యుమ చలింపక యుండెన్ 164

క. శివ మెత్తి యాడెఁ బ్రకృతి, య
శివము నడంపఁగ ధనువు శచీపతి యెత్తెన్
శివున కభిషేక మిది యని
శివ సుస్థిర యై మనమున సేవించె శివున్ 165

తే. వఱలు పంచాగ్నిమధ్యతపంబు పేర్మి
నాలుగగ్నులు భయ మంది వాలుఁగంటి
సత్తపోఽగ్నితేజముఁ గూడి సాఁగుచుండ
లోక మంతయు విభ్రాంతిలోల మయ్యె 166

క. అట్టితపోఽగ్నిజ్వాలలు
చుట్టెను లోకముల నెల్ల సూటి నెగయుచుఁ గా
ముట్టె నజుని పీఠము, భయ
పెట్టె నకాలంపుఁ బ్రళయపీడ యిది యనఁగా 167

క. మంటలు చని చని యభవున
కంటినఁ గనుఁ దెఱచి చూచి యంతయుఁ గని వా
ల్గంటిపరీక్షార్థము ము
క్కంటి బయలుదేఱె నాపెఁ గరుణించుటకై 168

మ. గజచర్మాంబర ! నాగభూషణ ! సతీకాంతా ! మనోజాంతకా !
యజ దేవేంద్రమునీంద్రయోగివరవంద్యా ! సూరిహృద్గమ్యా ! భ
క్తజనారాధితపాదపద్మ ! భవవిధ్వంసంకరా ! శంకరా !
ద్విజసంస్తుత్య ! పవిత్రగాత్ర విభవా ! దివ్యప్రభావా ! భవా!

వృథ్వి. శ్మశానభూములు, శంభో ! నివాసస్థలంబుల్
పిశాచు లాద్యులు ప్రేమాస్పదుల్ ముఖ్యభృత్యుల్
శశాంకశేఖర ! సాంబా ! చితాభస్మధారీ !
పిశంగజూటి ! సుపింగేక్షణ ! రుండమాలీ ! 170

ఉపేంద్రవజ్ర. పురాంతకా ! శంభు ! సుపుణ్యమూర్తీ !
సురాసురారాధితసుందరాంఘ్రీ !
చరాచరాత్మాఖిలజంతుపోషా !
సరోజమిత్రాద్భుత సత్యవేషా ! 171

మాలిని. వరవృషభతురంగా ! భక్తలోకాత్తిభంగా !
పరమపురుషలింగా ! భవ్యకాంత్యంతరంగా !
శిరధృతసురగంగా ! చిద్విలాసా ! శుభాంగా !
ప్రవిమలయశ ! గంగారాజచిత్తప్రసంగా ! 172

ఇది శ్రీవత్సగోత్రపవిత్రాపస్తంబసూత్ర రాజయ
మంత్రజ్ఞపౌత్ర రాజేశ్వరకరుణాపాత్ర- లక్ష్మణ
కవివర పుత్త్ర సుకవిజనకమలమిత్రగంగా
రాజేశ్వర కవిశేఖరప్రణీతం బగు
పార్వతీవిజయ ప్రబంధంబున
గౌరీజననం బను
ద్వితీయఖండము.

# తృతీయ ఖండము

## గిరిజా కల్యాణము

శ్రీకంఠ! భస్మాంకిత!, దివ్యకీరా!
లోకేశ్వరా! సజ్జనలోకబంధూ!
పాకారిసంసేవితపాదపద్మా!
శోకార్తినాశా! శశిచూడభాసా! 173

శ్రీకరమంత్రకూటనగరస్థిత! శ్రోత్రియశుద్ధభూసురా
నీకము వేదమంత్రముల నీ కభిషేకము సేయఁ గాంచి యా
నాకనివాసులున్ బ్రమథనాథ నినున్ భజియించుకోర్కెఁ, భూ
లోకసుగౌతమీతటవిలోలిత మంతెనయందు, జన్మమున్
మా కిడు మంచుఁ గోరెదరు; మంత్రపురీశ్వర! గౌతమేశ్వరా!

క. శంకరునిపరీక్షను నా
శాంకరి విజయమ్ము నెట్లు సాధించెను? కూ
లంకషముగఁ జెప్పుఁ డన శ
శాంకధరునిఁ దలఁచి సూతుఁ డా,శౌనకులన్ 175

క. కని ప్రియమున నిట్లను, శివ;
ఘనతపమును నిర్వహించుఁ దత్పరదీక్షన్
గనవచ్చి శివునిరాకకు
మునుముందు శరత్ప్రకీర్ణమోదంబలరెన్ 176

క. వచ్చె న్నాశ్వయుజము, కొని
తెచ్చెన్ శరదృతువు దిశలఁ దేజము నింపన్
విచ్చెన్ మేఘపటలములు
విచ్చినపురి ముడిచి కేకి వెలవెలఁ బాఱెన్ 177

క. స్వేచ్ఛ విహరింపఁ దొడఁగె
స్వచ్ఛాకాశంబునందు శరదభ్రంబుల్
స్వచ్ఛందవిహారంబుల
నచ్ఛసరసులందుఁ జలుపు హంసములవలెన్ 178

సీ. దినమణిపొడమెఁ బ్రాగ్దిక్సతిముఖమున
దిద్దిన కుంకుమతిలక మనఁగఁ
దమ్ములదొరలేమఁ దమిదీఱఁ బ్రేమతోఁ
దమ్ములన్నిద వదల్ప ననఁగఁ
దిమిరారి వొడముచు దివ్యప్రభల సాంద్ర
తిమిరంబులను దోలు దివ్వెయనఁగ
లోకహితుఁడు పుట్టు లోకాల నేల, వి
లోకించు ఘనదయాలోచనుఁ డన

తే. ధరణిదేవుల యర్ఘ్యప్రదానములను
సరసమతు లిచ్చు ఘననమస్కారములను
భక్తజనము లొసంగు నుపాయనములు
గైకొనుచు వారి నెల్లరఁ గాచు ననఁగ 179

క. నిర్మలజలపూర్ణముల సు
కర్మల మానససదృశసుకాసారముల
న్నూర్ములు దటము స్పృశించును
మర్మపుభాషలను బ్రియులు మాటాడి రనన్ 180

క. కలహంసల గుంపులతో
మిలమిల మెఱయుచును దిరుగు మీనంబులతో
నలికులబృందంబులతో
సలిలజములతోడ నొప్పె సలిలాశయముల్ 181

సీ. కరిణి, ముదమున నిక్షుఖండముల్ ద్రుంచియుఁ
ప్రియునకు నందించుఁ బ్రేమ మించ
హరిణి, లేఁబచ్చిక యందంబుగాఁ గొని
ప్రియునకు నందించుఁ బ్రేమ మించుఁ
చిలుకపెంటి, ఫలము చేకొని వలపునఁ
ప్రియునకు నందించుఁ బ్రేమ మించు
హంసి, తామరతూండ్లాహారమున గ్రహించి
ప్రియునకు నందించుఁ బ్రేమ మించు

తే. భ్రమరి యందించు మధువును భ్రమరమునకుఁ
జక్రవాకియుఁ గింజల్కచయముఁ బతికి
వరకపోతియుఁ బొట్టల వసనికొఱకుఁ
ప్రియము లారంచు నందించుఁ బ్రేమమించు 182

తే. తేనెసోనల నొలికించుఁ దేనెపెరలుఁ
జాలధారలు గురియించు నాలగములుఁ
బూలవానల వర్షించు భూజలతలుఁ
బాదపంబులు రాలుచు ఫలచయములు 183

తే. హైమవతి, విస్మరించి బాహ్యంపుస్మృతులు
దీర్ఘ మైనసమాధి సుస్థిరతఁ గాంచ
నీశ్వరుని నిల్చు ప్రకృతి సేవించుచుండె
మహిని నిండెను నా జగన్మాత యనఁగ 184

వ. అనంతరంబ. 185

క. ధనువునఁ జేరెను సూర్యుఁడు
ధనురాకారములు మనుజతనువులు దాల్చెన్
దినములు హ్రస్వము లయ్యెను
జనులకు నాశ్రయము లయ్యె జలజాప్తాగ్నుల్ 186

క. హిమమును గురియించుఁ దనమ
హిమలను జూపించు నట్టిహేమంతమునన్
హిమనదములు ప్రవహించును
హిమవంతునిసుత చలింప దేమాత్రంబున్ 187

క. రాత్రులనిడుపులు గోఁచికిఁ
బాత్రుల కతిదుఃఖము, ధనవంతుల కెపుడున్
ధాత్రిని సుఖవంతము లగు
గోత్రజ కవి సమములగుచుఁ గొల్చుచు నుండున్ 188

క. చలి కులికి వేఁడివెలుఁగు, వి
చలితుండై పాఱఁ దొడఁగె శశరథముపయిన్
గలగుండువడె జగంబులు
చలింపదు గిరిజ తపం బచలసుత యగుటన్ 189

క. రవి మకరముఖముఁ జొరఁగా
యువకులె మకరస్వరూప మొందఁగ నింకన్
జవహీనవృద్ధులకును గె
లువసాధ్యమె చలిని మూఁడులోకమ్ములకున్ 190

క. ఇటు హేమంతాంతంబునఁ
బటుతర మగు శీతలప్రభావముతో ది
క్తటముల ముంచెడిమంచున
దిటవుగ నా గిరిజ తపము దీర్చుచు నుండన్ 191

క. కపటంపు బ్రహ్మచారిగ
నిపుణతవెలయంగ, మేను నీటుగొలుపఁ బా
శుపతపుఁదాలుపు సేరెను
దపస్వినిఁ బరీక్ష గాన; నతనిఁ గాంచి వెసన్ 182

క. త్రొట్రుపడుచు నుమ లేచియు
వట్రువముంగురులు నొసట వ్రాలుచు నుండన్
జాట్రాతి నాని నిలిచెను,
నిట్టనిలిచి కపటవటుఁడు నేర్పునఁ బలికెన్ 193

పరీక్ష

ఉ. జవ్వని! రాచబిడ్డ వని చప్పునఁ జెప్పఁగవచ్చు, ఘోరమౌ
నివ్వని నొంటి నుగ్రతప మేటికొ? నూతనయౌవనంపుశ్రీ
నివ్విధిఁ గాన వ్యర్థ మొనరించుట యేలకొ? చారుదంతి! నీ
నవ్వులు నిండువెన్నెలల నవ్వఁ గదా! భువనైకమోహినీ!
పువ్వులతేనెకై మధుపముల్ దిరుగాడుట గాంచు మాదెసన్ 194

తే. అన, నసందర్భలాపంబు లా చనవును
గనుచు, మోమున విసుగును గనుపఱుచుచు
నేరుగా మాటలాడక నేరుపుమెయిఁ
దనదు చెలికత్తెతో నిట్టు లనియె గిరిజ 195

తే. బ్రహ్మచారికిఁ బని యేమి పడఁతి తోడ
నాఃశ్రమఘటమున కేలకో? యగ్నిబాడ
గురునికోపానలంబునకు గుఱిగాక
వచ్చుమార్గంబు పట్టి పోవచ్చు ననుము 196

వ. అను కలికిపలుకుల కడ్డుపడి 197

క. చక్కని నీ రూపమె న
న్నిక్కడకు న్నీడ్చితెచ్చెనే! పూఁబోఁడీ!
చక్కెరఁ బోలెడు నీ మృదు
వాక్కులు నా పాదములకు బంధము లయ్యెన్ 198

వ. ఇంకను గురునికోపానలం బంటివేని 199

క. గురుకులవాసము నేఁడే
పరిపూర్ణ మొనర్చి యిందు వచ్చితి, నింకన్
సరియగు కన్నియఁ గైకొని
చరియించుట మిగిలె పూర్ణశశినిభవదనా ! 200

తే. అనుచుఁ బూర్వపరిచయ మున్నట్లు, మైత్రి
గరఁపుచున్నాఁ డిఁకే మందు గడుసువాఁడు
సిగ్గు గావాయె మాటాడ స్త్రీలతోడ
ముక్కుసూటిగఁ బొమ్మను మునికుమారు 201

వ. అనిన నమ్మాటలఁ బట్టించుకొనక వటుండు. 202

తే. అంట నినుమును లాఁగు సూదంటుఱాయి
వంతకును ఱాయి చుండును వఱదనీరు
బెల్లమును బెట్టి చీమలఁ బిలువవలెనె !
తప్పు నీయందు, న న్నందు ? తగుపసందు ! 203

తే. మూసిపెట్టిన నింకను బాసిపోవు
వాదు మన కేల ? వినుము నా వాంఛితంబు
సరసగుణజాల ! చంచద్విశాలనయన !
స్నిగ్ధముకురకపోల ! శశినిభఫాల ! 204

ఉ. చల్లకువచ్చి ముంత నిటుఁ జాటుకు దాఁచుకొనంగ నేల ? నో
పల్లవపాణి ! నీ హృదయపద్మముఁ గోరితి, నా మనంబు రం
జిల్ల నొసంగి పంపు సరసీరుహలోచన ! కోరకుండనే
చల్లనినీడ లిచ్చుతరుజాలము వైపొకసారి చూడుమా ! 205

వ. అనిన శివప్రియ నొచ్చుకొనుచు సఖి నుద్దేశించి ట్లనియె. 206

క. అంగనలము, మా నియతికి
భంగము రాకుండునటుఁ దపము సేతుము, మా
సంగతిసందర్భమ్ములె
లింగియుఁ జొరఁబడెను నిత్తరిం గంటిగదే! 207

క. మగపురుగునకు నశక్యం
బగు మనయాశ్రమముఁ జొరుట, యాశ్చర్యం బి
తెగువకు నే మనవచ్చును?
మగతన మన నిట్టి దౌనె? మహియందు సఖీ! 208

క. వటుశేఖరులుం గారలు!
కుటిలాలకపలుకులఁ జెవిఁ గొంటిరి గద! యి
ప్పటి క్రైనను వేంచేయుఁడి!
కటకటయేల? యని చెలిమికత్తియ పలుకన్ 209

తే. నా మనంబు హరించిన నాఁటఁ గోలె
నా మనోహారి వైతి వన్యాయ మగును
తస్కరుండ వని నను బల్కఁ దనదియ ప్రతి
బింబ మగుపడు నెదుటి యద్దంబునందు 210

వ. అనుచుఁ దత్ప్రతివచనంబులుగా నపర్ణ సఖితో నిట్లనియె. 211

క. పరమదయాకరుఁ డగు శం
కరుఁడే నా ప్రియవరుండు, గాన శశిధరే
తరు లెల్లరు నాకు సహో
దరతుల్యు లటంచుఁ దెల్పు తామరసాక్షి! 212

చ. అరమర యేల ? నా యభయహస్తుఁడు, దీనజనావనుండు, శం
కరుఁడు కరంబు వట్టఁ దగుఁ గాక మ జొక్కరుఁ డెవ్వఁడేనిసం
బరమున దానెఁ గోర శలభంబువలెన్ మసియౌనుఁ గాన, నీ
పరమరహస్యముఁ గని శుభంబునఁ బొమ్మను మి ద్విజోత్తమున్

క. వింటిరెగద ! దేవిమతముఁ
గంటిరెగద ! మా విధంబుఁ గన్నారంగా
నుంటిరెగద ! యింకను నిటఁ
దంటాలే వచ్చుఁ బైనఁ దరలని యెడలన్ 214.

వ. అను సకియవాక్యంబు లెక్కింపక యక్కపటవటుండు. 215.

చ. సుందరి ! నీ ప్రయాసములు సూచెడివారిమనంబు క్షోభలం
జెందఁగ జేయు, నీ మది విచిత్ర మచంచల మద్భుతంబు, నీ
కెందుకుఁ దోఁచ దొక్కొ ? విన వెందుకు నాదుహితైకభాషణం
బందని మానిపండ్ల కయి యత్నుల సాఁచుట యేలకోమలీ ! 216.

క. నరిపోవునె తా వలచిన
వరియింపఁగ వలదె ? ప్రియుఁడు వారిజనేత్రా !
యిరువురి మనములు గలసిన
వలయును స్నేహంబు గాదె వసుధాస్థలిలోన్. 217

తే. పొరుఁగు బూరెలకై నెయ్యి పొయ్యి మీఁద
గాఁచి యుంచుట పరిహాసకారణ మగు
నెండమావుల నీళ్ళకై యేఁగి నంతఁ
దృష్ణమానున ? మిగులును దృష్ణకాని. 218.

వ. అయినను నే నిటకు వచ్చుట నా యదృష్ట వశమునసే గదా
నేఁడు 219.

తే. అడఁబోవంగఁ దీర్థంబె, యమ్మ నెదుర
వెదకుచుండిన, దీవియ ద్రొక్కి కంటె
వరుఁడు స్వయముగనే తాను వచ్చె నేఁడు
చేరఁదీయక యుండుట చిత్ర మబల! 220

తే. కూర్మిఁ ద్రికరణశుద్ధిగాఁ గోరువానిఁ
జేయి జేకొని సౌఖ్యంబు చెందు మతని
పిదప యితరుని వెదకుట వెఱ్ఱి గాదె
తరుణ మిది మించినను రాదు తరుణి! మరల 221

ఆ. కోర్కి లేనివానిఁ గోరుచు నుండుట
వలపు లేనివాని వలచుటయును
నిచ్చ లేనివాని నిచ్చగించుటయును
గగనకుసుమకాంక్ష గాదె? ముగ్ధ! 222

ఆ. నీవు గోరువరుని నిజతత్త్వ మెఱిఁగిన
మనసు ద్రిప్పుకొందు మందయాన
మేల్మియై కనపడు మేఁడిపం డాతఁడు
కరిమ్రింగినవెలఁగపల మతఁడు 223

వ. ఎట్టు లంటేని? 224

ఉ. అంగన! నిన్నుఁ బోలునది యాతనిఁ బెండిలి యాడి మున్నె, యా
లింగనచుంబనాది రతిలీలలఁ దేలిచి బ్రహ్మచర్యముల్
భంగము చేసి తాఁజనియె వాసన చూచిన పుష్పరాజము
న్నింగిలి చేసినట్టి ఫల మిస్తురొ! కోరుట నీకుఁ జెల్లునే? 225

ఉ. అంతకు సిద్ధమే యనుచు నంటివ, హో, విను ముద్దరాల ! క
ష్టంతలు విప్పి చూపెదను గామవిరోధి మనంబు దాయి, ర
వ్వంతయునైనఁ బుట్టదు ద్రవంబు, కరంగుట యేడ ? నా సతీ
చింతయె కాని, వే రొకటి చింతన పొంతన గాదు వానికిన్ 226

ఉ. భోగము లన్ని వీడి సతిపోయినమార్గముఁ బోదు నంచు బై
రాగిగ మారెఁ, జేరెను విరాగియునై వనసీమలన్, మహా
యోగపథంబునన్ బరమయోగిగఁ బేర్చెనె. నైష్ఠికంబుపై
రాగముజేసివాని యనురాగము గాంతువ ? కాంతు వేని యా
జోగినిఁ జేసికొంటయన జోలెలు మోయుటకే మృగేక్షణా ! 227

మ. నినుఁ బెండ్లాడ నతండు సిద్ధపడినన్, నీలాలకస్తోమ ! యా
తనివేషంబువిఘంబు నారయుటచేతన్ బుద్ధిదోషంబు వా
యును ! చిత్తంబు స్థిరంబు నయ్యెడును ! సూక్ష్మంబు గాంచ
వెన్వెంటనే
చనుఁ జీకట్లు ! తమంత నింక విను మో సౌదామినీసన్నిభా! 228

సీ. పులితోలుగట్టిన పురుషునితోఁ గొంగు
ముడివేసికొని మోదపడెద వెట్లు ?
బూడిద మే నెల్లఁ బూసికొనెడివాని
కౌఁగిటిసౌఖ్యంబు గాంతు వెట్లు ?
సర్పరాజములు భూషణములుగలవాని
కరమును గైకొనఁ గలుగు దెట్లు ?
పుర్రెలో భిక్షాన్నముం దినువానికి
నిల్లాలవై భజియింతు వెట్లు ?

తే. వల్లకాటిని వసియించువానిఁ గూడి
కాఁపురం బీవు చేయుచుఁ గ్రాలు టెట్లు ?
ముసలియెద్దెక్కుమొనగానిముందుఁ జేరి
స్వారివెడలంగ నీ వెట్లు సమ్మతింతు ? 229

వ. మఱియుఁ దదాకృతివిశేషంబు వినుము. 234

సీ. మూఁడుగుణంబుల మూలం బొకటి యని
చూపును మనకుఁ ద్రిశూలము గాని
లేఁడివలెను బరుగులాడు మానసమును
బట్టు మనుమ లేఁడిఁ బట్టి చూపు
హాలాహలంబును నరికట్టి గళమున
వెత లోర్వ్వ మని లోకహితవు గఱపుఁ
దలయందు గంగను; నెలను దాఁ దాలిచి
శాంతము వహియించు సరణిఁ జెప్పు

ఆ. వట్టిమాటఁ గట్టిపెట్టుము పన్నిరు
బూదిఁ గలిపినట్టి పొలుపు దెలుపు
నూఁకఁ దంపినట్టు లున్నది నీ తీరు
చాలుఁ జాలుఁ జనుము చనుము యనఁగ 235

క. పెట్టిఁ దెదుటిమాటలు చెవిఁ
బట్టించుకొనండు తన్నుఁ బల్కిన పల్కుల్,
గట్టిగ వాదించును దాఁ
బట్టిన శశమునకు మూఁడె పాదము లనుచున్ 236

వ. [illegible]ను దనఘోరణియె కొనసాఁగించుమ నా బ్రాహ్మణ కుమారుం
డాశ్రయించిన సత్పర్వతరాజపుత్రి కిట్లనియె. 237

క. ఊహను జోడను, పెండ్లికిఁ
జూడవలయు, నది గుదురనిపోటుల నరయన్
రోఁడెను నెద్దును బండికి
బోడుం గట్టినవిధంబు చొప్పడు సుమ్మీ ! 238

తే. మిన్నయై యున్నచో వాఁడు మిన్నుఁ బొందుఁ
చిన్నయై యున్నచో వాఁడు చిన్నవోవు
నదిసమానుండె పొందును సౌఖ్యదంబు
సమ్మతతుల్యాప్రమ్మతం బతెవ వినుము 239

మ. పలగోత్రంబులు పుట్టుపూర్వములు వాకొల్పంగలే రెవ్వరున్
దలిదండ్రుల్ గల రంచుఁ జెప్పుటకు నాధారంబులే దెవ్వ! నా
మలు రేఖల్ గణియింపలేము, గుణముల్ పూర్ణ్యంబు లేవన్నఁ దా
విలటుఁ బాతిలరాత, వ్యాప్తి మగనంటానం బనంతంబు నా
వలమం దాతనిబంధునాంయులు ఘాతప్రేతకైవాసముల్ 240

క. బాలా! మూర్ఖత వినుమా
బాలేందుధర ప్రకారభావంబున నీ
లాలింపుము నీ మనమున
నీలాలకన్నుత్యవదన! నిర్మలరదనా! 241

తే. గుణము లన్నింటి కెం దవగుణము లరయఁ
దనకుఁ దోఁచ దొకడు సెప్ప వినదె వినఁడు
దానుఁ గూర్చున్నకొమ్మను దానె నఱకు
మూర్ఖుగతి దెలిసికొమ్మ! యో ముద్దుగుమ్మ! 242

సీ. పిలిచి పీఁటను వైచి బిడ్డ నిచ్చెద నన్నఁ,
గూఁతురువాని యన్నోఁను నొకండు
లచ్చి తనంతఁ దా వచ్చిచొచ్చెద నన్నఁ,
దదక యడ్డముగఁ బెట్టెడు నొకండు
షడ్రసోపేతభోజనము ముందుంవ, న
జీర్ణ మంచును నేడ్చు జెనఁటి యొకఁడు
యరఁటిపం డొలిచియు నరచేత నునిచిన
నారగింపఁగలేని వ్యర్థుఁ డొకఁడు

ఆ. కోపమున్న వరుఁడు గోరి రా వచ్చినఁ
గోర్కె వాని నేలకొనని నీవు
నిష్ఠివాం నరము నే జగమందున
మీకు సాటి యెవరు ? మీరె గిరిజ ! 243

వ. అట్టి గట్టిమాటలు గిట్టక గిట్టురాపట్టి యెట్టకేలకు 244

క. మనసిజహరుఁడే నా దగు
మనసును హరియించె దానిమరలుపఁ దరమా ?
మనసును, మాటయుఁ, గ్రియయును,
మనుజశ్రేష్ఠులకు నొకటె మహిలో; ననఁగ౯ 245

క. మనసు వరించెను నిన్నే
మనసును మరలింప సాధ్యమా ? నాకుఁ జెలీ !
మనసును, మాటయుఁ, గ్రియయును
మనుజశ్రేష్ఠులకు నొకటె మహిలో వినుమా ! 246

తే. హరునిఁ బ్రేమింప నీ కెంత హక్కు గలదొ, యంతియే నిన్ను
వరియించు హక్కు నాది.
విధిని మఱచియు హక్కుల వెదఁకికొనుట నేల విడనాడి
సామును నెఱపుట యగు 247

వ. అనుచున్న నక్కపటవటు వికటవివాదంబు విననోపక ప్రతిజ్ఞా పూర్వకంబుగా నయ్యేలనాఁగ యెలుంగురాలివడ నిట్లనియె.

తే. శంకరునిసాక్షి చెప్పెద నింక వినుము
యాడినం బెండ్లి యతనినే యాడవలయు
నతఁడు న౯ గృపఁజూడక యలిగెనేనిఁ
గన్యనై యుండెదను గాని యన్యు నొల్ల 248

వ. అనినఁ బ్రతివచనంబుగ నంతయమీలంగన నిట్లనియె. 250

తే. పార్వతీదేవిసాక్షిగాఁ బల్కుచుంటి
నాడినం బెండ్లి యాడెనే యాడవలయు
నాపె నన్ గృపఁజూడక యుండెనేని
బ్రహ్మచారిగనుం దొండుపడఁతి నొల్ల 251

వ. అని విని యగ్గిరికుమారి దుఃఖార్తయై యేమియుం దోఁచక. 252

క. మానవతుల నొప్పింపకు
మా ! నవకుసుమములు వారిమనసులవి సుమా !
మానవ ! జన్మం బెత్తితి
మానవ ? యింకనైన నీ యామానుష క్రియలన్ 253

వ. దానికి సమాధానంబుగా బ్రహ్మచారియు. 254

క. మానము, నాదియను మరచి
మానము మానుటయు నీకు మానవతే ? నీ
న్మానము గావలసిన, నవ
మాన మెఱుఁకున్ సలుపుట మానుదగు సుమా ! 255

క. విందునను, విందు జగతిని
వందనమున వందనంబు వర్ధిలుచుండున్
గందర్పాంతకుఁడే యీ
విం దని, యరవిందనయన ! విం దొనపవదే 256

క. కపటవటుం డివ్విధమునఁ
గపటం బెఱుఁగంగలేని కన్యామణితో
విపరీతంబులు వల్కఁగఁ
గుపిత యగుచు దూఱు నిట్లు కుహనావటున్ 257

క. ఎంతటి కపటాత్మ్ముఁడవో ?
యెంతటి కలుషాత్మకుఁడవొ ? యేమందు నినుఁ
గాంతలఁ గంగారు పఱుపఁ
బంతము పూనితివ యేమి ? పాషాణాత్మా ! 258

చ. చలము వహించి, కన్నియలఁ జంపితినం దగు సాహసంబు, చం
చలమగు నీ ప్రవృత్తి లిఁకఁ జాలు నెఱుంగుమ యింక నీ వచం
చలము, స్థిరంబు నా మనము స్థాణునినన్నిధి, దానియందు నం
చలనము లేఁపఁజూనుట యసాధ్యము వచ్చినత్రోవఁ బొమ్మికఁ

వ. అని, కోపతాపశోకంబులు ముప్పిరిగొనఁ బల్కుచున్న యక్కలువ
కంటి కన్నులు తటాకంబులైన నక్కంబుకంఠి నోదార్చు
విధంబున మొలకనవ్వుల నవ్వటుం డిట్లనియె. 260

క. చింతలుడిఱును, మదిఁగల
భ్రాంతియు వెసఁ దొలఁగు నిక్కవంబిది యిఁక నీ
వంతం బీదేరెడితఱి
యెంతేనియు డగ్గఱియెగదే ! శుభగాత్రీ 261

వ. అని వెగటుగ నవ్వుచు నిలిచిన నక్కుటిలవటునిఁ గని య
క్కిసలయపాణి కుటిలకుంతలంబు లసియాడఁ బ్రళయకాల
కాళీరూపంబున మహోగ్రశాపంబు గా నిట్లనియె. 262

ఆ. పరమశివునిఁ బూర్ణభక్తిఁ గొల్చెదనేని
యతనిపదము నమ్మి యలరుదేని
నన్ను హింసచేయునరరాక్షసుం డిదే... 263

వ, మధ్యంబున నమాంతంబుగ నందుకొని 264
"నిన్నుఁ బెండ్లి యాడు నిజము నిజము"

వ. అని యాశీఃపురస్సరంబుగ శుభాంతంబుగాఁ బూరించి- 265

క. పర్వశశివదనుఁడు వటుఁడు
పర్వతరాట్పుత్రను గనుచుఁ బకపకనగుచున్
గర్వ మలర నిలిచి యుమ న
నిర్వచనీయపు విషాదనిరధి ముంచెన్ 266

క. కమలాస్య మోము ముడిచెను
గమలారిని గాంచినట్టి కమలముపోల్కిన్
గమలిన తన్ముఖపద్మముఁ
గమలాప్తుఁడు చూడలేక ఘనముల దూరెన్ 267

వ. ఇట్లితని వికృతభాషణంబులు మనోభంజకంబు లగుటం దన మొగముఁ గొంగుమాటున మాటుపఱిచి గోడుగోడున నేడుచు నప్పూఁబోఁడినిఁ గని 268

క. బాలా! యేడిచె దేలా?
యాలోచన చేసి నిశ్చయాత్మవు గమ్మా!
యీలో, సాయంసంధ్యా
కాలికములు దీర్చి రేపు గ్రమ్మఱి వత్తున్ 269

క. ఇటు లాడుచు నచ్చోటును
గుటిలవటుఁడు వాసి చనినఁ; గుములుచు మిగులన్
గుటిలాలక యెటుఁ దోఁచక
గొటగొటఁ గన్నీరు గాఱ బోరున నేడ్చెన్ 270

వ. అనంతరంబ కొంత తేఱుకొని, నిరాశామేఘ క్రాంతమనో గగన వీథి యై సఖులఁ గాఁగిలించికొని. ప్రియు నుపలక్షించి యిట్లు విలపింపఁ దొడంగె 271

## తపస్సిద్ధి

మ. కననే కాన నటించుఁ గూర్చొనియె నా కైలాసనాథుండు, నే
విననంటే విన నంచు దీక్షగొనె నీ విప్రుండు; ప్రారబ్ధమే
మని నా నెన్నొసటన్ లిఖింపఁబడెనో? హా! యీ విపత్సాగరం
బున నీ జీవితనౌక యుత్తెఱఁగునన్ మున్గంగనై యున్నదో! 272

క. ఏమియుఁ దోఁచక యున్నది
భామినికో! యింక నేను బ్రతుకం జాలన్
నా మది భ్రమించుచున్నది
స్వామిదయకు దూరమైతిఁ జావఁగ నైతిన్ 273

వ. అని, జీవితేశ్వరు నుద్దేశించి యాత్మగతంబున 274

శా. మా. ఓ కైలాసనివేశ! యీశ! వరదా! యోగీనమందార! హా!
నీకై తెన్నులు చూచి చూచియును, నే నిస్సారనైతిన్ హరా!
నా కన్నుంగవ కాయగాచెను జగన్నాథా! దయాసాగరా!
రాకాచంద్రనిభాస్య! యింతవరకున్ రా కుంటి వే మందురా!
నీకే సర్వముధారవోసితి నహో! నీ దాన నౌరా ప్రభో!
యేకాకి న్నను పేక్షసేయుటలు నీకేచెల్లుఁ బ్రాణేశ్వరా!
నీ కారుణ్యకటాక్షవీక్షణములన్ నే నోచనైతిం బ్రియా
లోకంబు న్మనుపంగఁ జాలెడు కృపాలోకంబ వీవే గదా! 275

తే. జూవి రాడంగనీయక పాపుఁ డైన యీ కిరాతాత్మకుండు
హింసించుచుండె.
దీనరక్షణబిరుదాంక దేవదేవ! నన్నుఁ గనరార!
యోగిమానసవిహార! 276

ఉ, మా. నామదిలోన నే నొకటి నాటితి కోర్కెలమొల్క, దానికిం
బ్రేమజలంబు వోయుచును బెంచితిఁ దద్దయుఁ బెద్దచేసితిం,
గామితమొప్పఁ బండ్లు కయి కంటికిఁ జెప్పయుఁ బోలెఁ గాచితి
న్నేమగునో ఫలంబు ? ఇఁక నెట్టులు వృక్షము గాచికొందునో ?
యో మదనాంతకా ! యెఱుఁగ నోపను, భారము నీయదే సుమా!
యీ మదనప్రలోభుఁడు సృజించెఁ దుఃఖము భయంకరంబుగా
భూమినిఁ బుట్టి యే సుఖముఁ బొందకపోయితి నైన నా పరం
ధామ ! దయాస్వభావ ! శుభదర్శనభాగ్యము గల్గఁ జేయుమా ! 104

వ. మఱియు నా ప్రమద మదనార్తయై మదనారిం గూర్చి

క. వలరాజుగొంగ ! నా యీ
పిలుపును విని మేలుకొనర, వేగంబున నన్
గలయఁగ రారా ! నా యీ
యెలుంగు రాలువడె నింక నెటు లోర్చెదరా ! 105

తే. కలలోన నిన్నుఁ గూర్చియ కలవరింతు
మెలఁకువను నీ గుఱించియ పలవరింతు
తలఁపులం దెప్పుడును నీదె తలఁపు, దయను
స్థలము నీయర నీ హృదిస్థలమునందు 106

క. తొలిజామున నినుఁ గొలిచితి
మలిజన్మం బెత్తి నీకు మనసిచ్చితిరా!
పలుకవు నోటను ముత్తియ
ములు రాలుర ? లేక నీవు మూగవ ? సాంబా ! 107

క. అతివ యిటు లనేకములుగ
స్తుతు లొనరించుచుఁ దదేకసుప్తాతీత
స్థితిలో నిల్చిన యా పా
ర్వతిమనమునఁ బరమశివుఁడు ప్రత్యక్షంబై 108

క. విలపింపకు మో కలికీ!
పలుకుమ తేనియల నొలుకు పలుకు లిదిగో నిన్
గలయంగ వచ్చితి, మెచ్చితిఁ
గలరే? నీ సములు ముజ్జగంబుల సాధ్వీ! 283

క. చెలి పిదే నాకుంగాఁ
గల వందుకుఁ దగినయట్టి కాలమువచ్చెన్
జలిముల పుట్టువ! నీ దగు
తొలిపున్నెము పండె వినుమ, తోయజనయనా! 284

క. వినుమా, నీ కృషిఫలియిం
పె, సుమా! నెగ్గితివి మేము సేయు పరీక్షన్
గొనుమా వలయు నభీష్టం
బనుమానంబేల? వేల? యనుపమలీలా! 285

వ. అని యనునయించు నమృతంపుఁ బలుకుల వినుచు నాత్మానందం
బనుభవించి రేపకడయ మేల్కాంచి గిరినందన ముదమున 286

ఆ. కనులు దెఱచి యెదుటఁ గపటవటునిఁ గాంచి
తోఁక త్రొక్కిన ఫణిపోకఁ గనలి
యాత్మలోనఁ జూచి యాత్మేశుఁ గానక
యావ ద్రాగినట్టు లయ్యె సతియ 287

క. కన్నియ యేడువఁ దొడఁగెను
పెన్నిధిఁ బోఁగొట్టికొన్న పేదవలెఁ జనుల్
వెన్నగఁ జేసియుఁ దన ప్రభు
మన్ననఁ గనలేని భటునిమాదిరి యరయన్ 288

వ. అత్తఱి నత్తరుణీపరిస్థితి గని భరింపలేక యాహాప్పు వాక్యంబులఁ
జెలి యిటుల వల్కఁ దొడంగె. 289

లయగ్రాహి. బాల ! విను నీ విటులు బేలవలె నేడువఁగ
నేల ? నినుఁ జూడఁగను బాల సుకుమారీ !
ఫాలనయనుండు కరుణాలయుఁడు నీ ప్రియుఁడు
జాలి యొనరించు ఘనలీల లివి సుమ్మా !
తాళు మిఁక నో సఖి ! కపాలములఁ జేఁ, పులి
తోలు ధరియించునతఁ డేలఁగలఁ డమ్మా !
నీలగళమందు ఘనవ్యాళమును దాల్చిన
బాలశశిశేఖరుఁడు పాలనము సేయున్ 290

వ. అనుచుండ నంతఁ బ్రాతస్సంధ్యోపాసనాకార్యంబులు నిర్వర్తించుకొని
త్వరితగతి నరుదెంచి పరశివాకారుండై యప్పర్వతరాజకుమారి
కట్టెదుట నిలచియున్న వటుండు 291

ఉ. భామరో ! కొంగుదాఁచి నినుఁ బ్రార్థన చేయుచు నుంటి నిష్ఠ నీ
ప్రేమను విశ్వరూపమునఁ బెట్టుము నా కనుమం బదే వదే
తామరపూలి నిన్ను ననుఁ, దక్షమము జంటఁగఁ గూర్చు దాని నే
ర్పేమని దాకొనంగలనె ? యేర్పడు ముందు నరాళకుంతలా ! 292

చ. కొలువును డిగి యీ వఱకె కోమలి నా హృదయాబ్జపీఠమం
దలరుచునుంటి వీ విధి యథార్థము; [illegible]వతె నన్ను నీదుమా
పులదెలికత్తెలం బనిచి పొల్పుగ వాసిన మంత నాదుక
న్నుల యెదుగవాషమార్గములనుండి కనుంగొనవచ్చు నెచ్చెలీ ! 293

క. రామా ! నీ పితరునిమదిఁ
బ్రేమించెదవేని యింకఁ బ్రియ మలరఁగ నీ
నామము జపియించుచు నేఁ
గామిని నీ కడప యొద్దఁ గావలి యుండున్ 294

ఉ. అని ప్రతిమాలుచున్న వసుధామరపుత్రుని నీచపుం బ్రవ
ర్తనకు నసహ్యమొందుచుఁ బరాభవవహ్ని సహింపలేక, ధూ
ర్తునిఁ గననొల్లమిం దనదు రూపము నాతఁడు చూడ కుండు న
ట్లొనరఁగఁ దాల్చెఁ గొంగుఁ దెర, యోడిన వాడిన మోముపై వెసన్

క. చెలికత్తియమెడకుం బడి
వలవల యేడ్వంగ ముదితఁ, బార్వతి, శివభ
క్తులనగ్రగఁ, దనప్రియయు, సు
లలితను, లలితను గనుచును లాలన మొప్పన్ 295

వ. ఆనందస్వరూపుండు నాదిభిక్షువు మోక్షప్రదాతయు నగు నప్పరమ
శివుండు దననిజస్వరూపంబున సాక్షాత్కరించి 296

## శివ సాక్షాత్కారము

సీ. అధరామృతంబు, గంగామృతంబును గూడి
యమృతంపుసోనయై యలరుచుండ
నవ్వువెన్నెల, తలపువ్వువెన్నెలఁ గూడి
చంద్రికలను వెదఁజల్లుచుండఁ
దెలమేను, తెలమేనువెలిబూదియుం గూడి
కాంతిమండలమును గఱపుచుండ
నీలకంధరము వినీలసర్పము గూడి
యేణాంకమై కనిపించుచుండఁ

తే. కలువకంటిని బ్రియమునఁ గను కటాక్ష
వీక్షణానేకకిరణముల్ వెదలుచుండఁ
ప్రాగ్దిశాకాశమున నపర్ణాచకోర
చంద్రుఁ డదో! యనఁ గన్పట్టెఁ జంద్రమౌళి 297

క. అంత గిరిజ శంకించుచు
నంతయు నక్కపటవటుని యద్భుతమాయా
క్రాంతితవేషవిశేషం
బెంతయు నమ్మఁ దగదంచు నిట్లనె సఖికిన్ 304

క. నమ్మను నా కన్నుల నిఁక
నమ్మను నా కంటియెదుటి నటరాజును నే
నమ్మను కపటవటుని గిటు
నమ్మించెను మాయగాని నమ్మను సుమ్మీ ! 305

క. కమ్మవిలుతుపగతుని నే
నమ్మిన కతమునను, నన్ను నమ్మించుటకే
యమ్మా ! యీ విధమగు నే
నమ్మను గాని విని సాహసమ్మొయుఁగనొకో ! 306

వ. అని, యాత్మగతంబుగ నించించుక విచారించుచు. 307

మ. కలయా ? కాదిది, కాంచుచుంటి జగతిన్ గాదే యథార్థంబు, సం
చలనం బందెనొ బుద్ధి ? లేదు. మఱి యే సాక్ష్యంబు నీక్షించినన్
దలఁపన్నేర నిజానిజంబులు, మనోదార్ఢ్యంబు హీనంబొకో
లలనా ! నీ వెటువంటిదో ? చెపుము కల్యాణంబు నీ కయ్యెడున్

తే. అనుచు సఖియమొగంబు ప్రశ్నార్థకముగఁ
గాంచ, సఖియు నతఁడె శివుం డంచుఁ దెలిసి
స్వామి నాటకంబునకు నాశ్చర్య మంది
పార్వతికి యథార్థం బిటుపల్కె నపుడు 308

క. నీలగళము, ఫాలాక్షము
మౌళిశశియు, గంగ; సర్పమాలికయున్, శా
ర్దూలత్వగ్వసనము, కర
శూలము, ఫడకాఁగ మిరియ కూలిమె కనుమా ! 309

క. కొమ్మరో ! నీ పూర్వసుపు
ణ్యమ్మది ఫలియించె నేఁడు, నాథుఁడు ప్రత్య
క్షమ్మయ్యె నాఁ నింవక
సమ్మతి శిరసావహించు స్వామిచరణముల్ 304

క. నిన్నుఁ బరీక్షించుటకీ
పన్నుగడం బన్నినాఁడు పరమేశ్వరుఁ డా
పన్నజనావనుఁ డను పే
రన్నివిధుల సార్థకంబ యయ్యె సతనికిన్ 305

తే. అపుడు పార్వతి యతని యథార్థముగను
విశ్వనాథుఁ డటంచును విశ్వసించి
పులకితాంగము మోదాశ్రువులును మెఱయఁ
బరవశంబునఁ బల్కెఁ గపర్ది కిట్లు 306

క. వచ్చితివా ? న న్నేలఁగ
మెచ్చితివా ? నా తపంబు మేల్మే లనుచున్
గ్రుచ్చెదవా ? బిగికౌఁగిట
ముచ్చట లన్నియును దీర్చి మురిపించెదవా ! 307

క. నోముఫలము సమకూరెను
నేమము లన్నియును దీఱె నేఁటికి, నిఁక నా
ప్రేమ ఫలించెను, హర్షము
నా మది నుప్పొంగె, పొరలె, నదియై పాటన్ 308

తోదకము. ఆడఁ దొడంగెను హర్షము మీఱన్
బాడఁ దొడంగెను పాటలు వేడ్కన్
జూడఁ దొడంగెను చూపులు సాఁబున్
వేడఁ దొడంగెను వేయివిధంబుల్ 309

సరసిజము: బిత్తఱిచూపుల్ పుత్తడిరూపుల్
ప్రియునిమనము తమవశము నొనరుపఁ
చిత్రమువేఁగఁ నొత్తికితేఁగఁ
జిఱునగవుఁ దళుకు మొగమున మెఱయఁ
మత్తసునేత్రఁ మెత్తనిగాత్రన్
మదననిశితకుసుమ విశిఖహతుఁడై
తత్తఱతోడన్ సత్తఱిఁ గూడన్
ద్వరపడఁ దొడఁగుచు శశిధరుఁ డలియెన్ 310

సీ. గంధహీనం బైనగంధతరువుఁ బోలె
రసహీన మైనసంద్రంబు పగిది
రాజ్యహీనుం డైనరాజు చందంబున
మంత్రహీనుం డైనమంత్రి వలెను
శౌర్యహీనుం డైనసైన్యాధిపతి పోల్కి
క్షాత్రహీనుం డైనక్షత్రియు క్రియ
ధనవిహీనుం డైనదాత విధంబున
భక్తిహీనం బైన భజన భంగి

ఆ. దీప్తిహీనుఁ డైనదినమణి కైవడి
వినయహీన మైనవిద్య రీతి
ప్రేమహీనుఁ డైనప్రియు సదృశంబున
నిన్ను విడిచి యుంటి నిన్నినాళ్ళు 311

సీ. పద్మాననా! నీవు పద్మంబ వైన నే
భ్రమరంబ నౌదు సంభ్రమము మీఱ
చంద్రవక్త్రా! నీవు చంద్రబింబం బైన
సరసచకోరముఁ జక్కనౌదు

జలజనయన! నీవు జలదంబ వైనచోఁ,
జాతక మౌదును సంతసమున
సరసిజపాణిరో! సరసి వీ వైన, హం
సంబు నే నౌదును సంబరమున

తే. అధరసుధ యొలికించి చల్లార్పు క్షుధను
హాసచంద్రికలఁ బఱపి యార్పు జ్వరము
హర్షబాష్పముల్ వర్షించి యడఁపు తృష్ణ
కేలుఁదరఁగలలోఁ దేల్చి కృపఁ దనుపుమ 312

వ. అని సరససల్లాపంబు లాడుచు. 313

క. మధుపము ఝంకృతి సేయుచు
మధువునకై తిరుగులాడు మాదిరిఁ, బార్వ
త్యధరామృతమును గ్రోల వి
విధగతుల మహేశ్వరుండు వేడుక వడియెన్ 314

క. హర్షంబున నధరామృత
వర్షము గురియు ఘనగిరిజ; వాంఛాపూర్తిన్
వర్షజలభ్రాంతత్వల్యా
కర్షిత శివచాతకము ముఖంబును దెఱచున్ 315

క. జలధరములోని జలమన
జలజారినిఁ గూడియున్నచంద్రికయొ, యనన్
జలరుహములోనిమధు వన
జలజానన యొప్పుచుండె శశిధరుమ్రోలన్ 316

గీ.మా. చూపుచూపును గలిసెను సొంపు మీఱ
మోముఁదామర వికసించె ముగుద కపుడు
తరుణిచెక్కిళ్ళ మెఱుఁగులఁదళుకు లీనె
వనజనేత్రముల్ వ్రాలెను వసుధవైపు

శిరము లేచెను గొంచెము, చిత్ర మెదుటి
కనులు విలిచెను, వెంటనే కాళ్ళఁ గదలె
దేహమో ! స్వామికడ నిల్చె దిశలు మెఱసె
శివునిదయచే గిరిజ తపస్సిద్ధి గనియె
నంత సంతోషసాగరమందు మునిఁగి
యోలలాడుచు లోకేశుఁ డుత్సహించి
లోలనేత్రవిలోలుఁడై లోకములను
దన్నుఁ దా విస్మరించెను దత్పరతను

మ. వికలంబైనమనంబుతోఁ జలితుఁడై విప్పెం గనుల్ భ్రాంతిఁ ద
ద్వికచోత్ఫుల్లదళాయతాక్షి గిరిజన్ వీక్షించి శంభుండుఁ, గొం
కక హస్తంబును బట్టి లాఁగి తనయంకంబందునం జేర్చి గౌ
రికపోలంబును ముద్దువెట్టుకొనియెం బ్రేమాంధుఁడై; వెంటనే 317

క. గౌరి తటాలునఁ దొలఁగియుఁ
జేరెను దవ్వులకు, వంచె సిగ్గున శిరమున్
గౌరాంగుఁడు విరహంబున
మారాహతిఁ దాళలేక మానినిఁ గనుచున్ 318

మానిని. మాలిక. చేరుమ యంచును జేతులు సాఁచుచుఁ జేరఁగఁ బార్వతి చేరువకున్
దూరము వోవుచుఁ దొయ్యలి నవ్వుచుఁ దోరఁపుసిగ్గులతో నను, నా
చారపురీతిని శాస్త్రముదెల్పు విచారముమేఱకు సాంబశివా !
యారయఁ బెద్దలయానతిచొప్పున నయ్యెడుఁ బెండ్లి యథార్థముగన్
గోరికనాఁబడు గుఱ్ఱపుఁగళ్ళెముఁ గొంచెము లాఁగుమ ! కొంతవడిన్
ధీరుఁడ ! నీ దగుతీయనివాంఛలు దీఱును దగ్గఱతీర మనన్
మారుని దూఱుచు, మానినిపై నభిమానము సూపుచు మారహరుం
డా రమణిం గని హస్తమునెత్తి, తథాఽస్తని, చేరెను నంతిపురిన్

వ. అయ్యవసరంబున 320

క. సామాన్యులక్షేమమునకు
హేమాహేము లనిలరవిహితసహితుండై
హేమంతునిఁ బాఱఁ దఱిమి
భూమీరాజ్యంబు శిశిరభూభుజుఁ డేలెన్ 321

ఉ. తోలెను జక్రవాయువులు, తోరముగా భువిఁ బండుటాకులన్
రాలెను, జెట్లు చేమలును గ్రాలెను శాఖలు గోలుపోయి, యీ
గాలికి జంకువారలము గా మని నిల్చెఁ, బరాజయంబునం
బాలయికూడ వీరములువల్కెడు యోధు లనంగ మోడులున్

ఆ. కాళ్ళుచేతు లాడి కండ్లులొట్టలు వోయి
బ్రతికి బయటఁబడ్డ భటుల భంగి
మోడు లగుచు నిల్చె భూజంబు లన్నియుఁ
బేద వడుచు వనము బింక ముడిగె 322

ఉ. గాడ్పుదుమారముల్ సెలఁగి కప్పెను ధూళి జగంబునిండఁగే
ల్మోడ్పులొనర్చినన్ వినక, ముక్కుల నోళ్ళను గండ్ల నింపుచో
నేడ్పులతోడ దిక్తటము లెల్లను నిండెను, భానుబ్రమింగునం
జాడ్పునఁ దోఁచె నా సుడిరజం బెగఁబ్రాఁకుచు నున్న యత్తఱిన్

ఆ. మోడు లిగురువచ్చు, మొట్టుఁ జిగుర్చు, వ
సంతునాగమంపు సమయమందు
నిల్లుగాలువాని కిమ్మడిసిరి యను
నార్యభాష వ్యర్థ మగునె యెపుడు 324

– సప్తర్షి దౌత్యము –

క. స్మరహరుఁడు గిరిజవిడి, తన
పురమునకుం జేరి విరహమునఁ గుందుచుఁ, బెం
డ్లి రయమునఁ గూర్చ దౌత్యము
జరుపఁగ సప్తర్షివరుల స్మరియించె వెసన్ 325

క. తలఁచియుఁ దలఁప మున్నే
నిలిచి యెదుట సప్తఋషులు, నిటలాక్షునితోఁ
బలికెరి, సెలవీయఁగదే!
తలనడచి యో[illegible]స్థ మిపుడె, దాక్షిణ్యనిధీ! 3[illegible]6

వ. అని, వి[illegible] సుమా[illegible]యుండు వారలకువిధివదర్చన లందించి సన్మానసత్కారంబుల నాదరించి, పార్వతినుద్వాహమాడు నుత్కంఠత నిట్లనియె. 327

క. సర్వజ్ఞులయ్యు మీరు ని
గర్వులు మీకుం బరోపకారంబున నీ
యుర్విన్ సము లెవ రౌకపని
నిర్వహణ మొనర్ప మిమ్ము నేఁ బ్రార్థింతున్ 328

క. ఒంటరిసంసారం బిది
కంటకతుల్యంబు మిగులఁ గష్టము గడుపన్
జంటం గూరుచుఁడి మరల
నింటియతనిఁ జేయరే! మునీశ్వరులారా! 329

క. హిమవంతునిఁ కూరిమిసుత
శమదమముల కాటపట్టు సర్వమునాకై
విమలమనంబున నొసఁగి, త
పమునన్ ననుఁగొన్న యువతి పార్వతి, వింటే! 330

సీ. పుడమిలాలుపుజేనిబుడుతను నా కయి
జడదారులార! మీ రడిగి రండి
యెడము లే దిరువురినడుమ మా కెన్నఁడు
నొడఁబడునట్లు సేయుఁ డితరములు

పడి కష్టములు, వేయి నుడివి యనృతములు
ముడివేయు మనెడునానుడియుఁ గలదు
కడునేర్పుతోఁ బని చెడకుండఁ గొంగులు
ముడివేయుభారము నిడితి మీకు

ఆ. పడఁతి రాని ! పెట్టువడి తనకోరిక
వడసిన ఘనురాలు పడఁతి మిన్న
యిడుమ లన్నిఁ గయమ్మ నిడి ప్రియవాల్లభ్య
మొదిని గూర్చుకొనిన పడుచు సుండి ! 331

తే తపము విడువక చేసిన ధన్య, ఫలము
ననుభవింపఁ గుతూహలమును వహించి
యున్నయక్కన్నెఁ గూర్పుఁడు నన్నుతముగఁ
బోయి రం డన వారలు ముదము మీఱ. 332

తే. నేడు మనభాగ్యములు పండె నీలకంఠు
సేవచేయునదృష్టంబు సేకుఱినది
యందఱను వీడి మనలనే యాదరించె
భక్తు లన నెంతటయ భగవంతునకును 333

తే. అని, తలఁచి, స్వామీ ! మీ సేవకై పుడమిని
గల్గితిమి దీనికంటె భాగ్యంబు గలదె
యెప్పుడును మిమ్ముఁ గొల్చుచు నిల్లై భక్తి
యుండెదము గాక। యీ తను వుండుదాఁక 334

తే. కోర్కె మిగులదు మి మ్మేమి గోరవలయు
మోక్ష మిచ్చిన నొల్లము మోక్షదాత !
జన్మయే దైన నిమ్మ నీ సంస్మరణము
నిల్చియుండుత ! మా మది నిత్యముగను 335

క. అనుచు మహర్షులు హిమగిరి
జనుచుండఁగ దౌత్యవార్తఁ జయ్యన మొదలే
వినిపింప ననందత్కా
ననము వసంతుండు సొచ్చె నవ్యత మీఱఁగ 336

తే. మ్రోడువాఱిన ప్రకృతి సమ్మోహనముగ
శివునిఁ జేపట్టఁబోవు నా శివనుఁ బోలెఁ
దత్పరత దిద్దికొనియె నుత్కంఠతోడ
సకలదిక్సుందరముగ వసంతుచెలిమి 337

సీ.మా. ఆమ్రమభూరుహము సింహాసనమై యొప్పఁ
బదపీఠె పచ్చికబయలు గాఁగఁ
లాళ ద్రుమాళి ఛత్రం బయి రంజిల్ల
మలయమారుతము చామరము వేయ
మధుమక్షికంబులు మధుధార లెత్తఁగఁ
బుష్పంధయములు పుప్పొడులు గుప్ప
పుష్పలతలు గూడి పూవాన గుఱియింపఁ
బాదపంబులు ఫలార్పణ మొనర్ప
హంసరాజములు గంగాంబువు లందింప
గంధవహుఁడు మంచిగంధ మిడఁగఁ
చిగురుజొంపంబులు చేపట్ట హారతుల్
దినమణి దీప మై తేజరిల్ల
శుకశారికాదులు స్తోత్రపాఠకు లయి
జయనాదములఁ గీర్తి చాటుచుండఁ
బికబృందములు చేరి ప్రేమపాటలు పాడ
నళిసమూహము రాగ మాలపింప

తే. మహితవిభవమున వసంతమాధవునకు
నొనరఁ బట్టాభిషేకమహోత్సవంబు
దనరె, నుల్లాసములు నిండె ధరణినెల్లఁ
బార్వతీదేవియుల్లము పల్లవిల్ల 338

హరిగతిరగడ

చిత్తానక్షత్రంబునఁ జంద్రుఁడు చేరిన పూర్ణిమదినమున భువిఁ గన
నెత్తావులతో మత్తగతులతో నింగిని వీడెను మధుమాసాంగన
వచ్చని సుందరపత్రకృతం బగు పట్టువసనమును దాలిచి, కన్నుల
మచ్చటగను గెంజిగురు ఆవికలో ముద్దు లొలుకు
విరిగుత్తులఁ చన్నుల
నిక్కుచు నా వనశోభను మించఁగ నేరుపుమెయిఁ గోకిల
కంఠంబున
మక్కువ సంగీతంబులు పాడుచు మదనునిఁ బిల్చుచును
ప్రమోదంబునఁ
దుమ్మెద లానెడు సోనలఁ బూవులతోఁ గూడిన పొదరిం
డ్లనఁబడు పెను
ధమ్మిల్లము నిగనిగలాడఁగ నెత్తమ్ములకన్నులు ధగధగ మెఱసెను
బాలరవిఁ దన ఫాలమునందున భాసురతిలకముగా సవరించెను
బాల వసంతునికౌఁగిటఁ జేరెను ప్రమద మలర ముద్దుల
నందించెను 339

లయహారి

చిలుకలు మధురము లగు ఫలములను దినుచుఁ గిల
గిల యనుచుమధువులను నొలుకఁ బలుకం, గో
కిలలు మృదుల మగు చివురులను మెసవుచును ముద
మలరఁ 'గుహుకుహు' మని చెవులు దనియఁ గూయం

గాలఁకులను గలవనజముల సుధను నవకుసుమ
ములరసములను గొనుచు నళులు రొదసేయన్
మలయగిరి పవనములు మెలమెలనఁ గదలుచుఁ బ్రి
యులను దగులఁగను దనువు లవి పులకించెన్ 340

క. నగరాజగృహము నందున
నగజయుఁ దన ప్రియునివార్త లందక కుందన్
నగుపడె శశితూర్పువనిత
మొగమందునఁ దీర్చినట్టి బొట్టో! యనఁగన్ 341

క. ఆకాశసభను ప్రాగ్గిరి
శ్రీకర సింహాసనమునఁ జెలువునఁ జుక్కల్
నైకంబులు సేవింపఁగ
రాకాచంద్రుండు రాత్రిరాజ్యం బేలెన్ 342

క. క్రూరమృగంబులు దమ యా
హారంబులకొఱకు నటవి నటనము సలుపన్
ఘోరపిశాచంబులును, వి
హారము లొనరుపఁ దొడఁగె నిరాఘాటముగన్ 343

క. ఘూకంబుల దాడులకుం
గాకులు వాఱం దొడఁగెఁ గకావిక లగుచున్
రాకాసుల బాధలకు, ది
వౌకసులు దివంబువీడి పాఱు విధమునన్ 344

క. జారులు జారిణులు, నిశీ
చారులుఁ, జోరవరులును, నిశానాథుఁ గడున్
గారములు నూఱఁ దొడఁగిరి
తోరపుటడ్డంకు తమకుఁ దోఁచుటవలనన్ 345

క. మారుఁ డదే యదనుగఁ దాఁ
గ్రూరపునారాచములను గొట్టఁ దొడంగెన్
మారారికి దూరముగ ను
మారమణిం జూచి మిగుల మాత్సర్యమునన్ ౩౪౬

వ. అంత విరహవేదన యగ్గలంబగుడు భరింపఁ జాలక ౩౪౭

క. మారా! నా దరి నీ కిఁకఁ
జేరఁగ శక్యంబు గా దజేయుఁడు హరుఁడున్
మేరువుచాపము దాలిచి
క్రూరా! నా హృదయ మంది కాపురి యుండెన్ ౩౪౮

క. అనుచు నదలించియును మదిఁ
గనలుచు మదనప్రభావఘనతాపంబున్
గొని విహ్వలయై, సఖి కి
ట్లనియె, శివవియోగచింత నా గిరిజ వెసన్ ౩౪౯

క. ఏఁడే? నా ప్రాణవిభుం
డేఁడే? ముక్కంటి జేఁ డదేలకో? యింకన్
రాఁ డాయెను గదె? యాతని
జాడలు లే వాయె తాళఁజాలనె లలనా! ౩౫౦

(పవడ గీతి) ఆ. నీడవోలె నిన్ను వీడ నంచును బాస
లాడి కూడ మఱచినాఁడు వాఁడు
వేఁడితప మరియెడు వెలగాని ఫలమేమొ?
యీఁడు, రాఁడు వన్నెలాఁడు చూడు ౩౫౧

క. వెంటనె పోఁగదవే! నీ
వెంటనె యాతనిని గొనుచు వేగమ రావే
కంటఁ బడని తుంటరి యగు
తుంటవిలుతుఁ దూపుమంట దోరం బయ్యెన్ ౩౫౨

క. బాగగు నీ వేగ, మనో
వేగంబున మనశుకంబు వెళ్ళును వానిం
దేఁగల దరనిముసంబున
నాఁగక పంపించు దాని నంబుజనయనా ! 353

– శుక రాయబారము –

వ. అను డాజెలియ శుకంబు రప్పించిన 354

క. రావే ! నా ప్రాణప్రియ !
రావే ! నా ముద్దులశుకరాజమ ! కావన్
నీవే తగుదువు, వేగమ
పోవే ! తక్షణము నా విభునిఁ దె మ్మనఁగన్ 355

ఉ. తొందర యేలనే ? విమలతోయజపత్రసునేత్ర !, నీ విభుం
డెందుకు రాఁడొ ? చూతు నిఁక నేడ్పులు మాత్రము మాను
మమ్మ ! నీ
కందము ? యంద మైనకను లందున నశ్రులు నింప ? నౌదలన్
జందురుదాల్చువాఁడు గనఁజాలఁడు నీ ముఖపద్మ మీ స్థితిన్

వ. అని, శుకంబు సమాధానపూర్వకంబుగాఁ బల్కి యోదార్చి 357

క. రివ్వున నెగసెను కీరము
చువ్వవలెన్ గగనవీధి సూటిగఁ బాతెన్
నవ్వుచుఁ గిలకిల శంభుఁడు
నివ్వెఱపడి చూచు చుండ నేలకు డిగుచున్ 358

క. వందనము లుమావల్లభ !
నందీశ్వర ! ప్రమథనాథ ! నాగాభరణా !
మందస్మితాస్యగిరిరా
ణ్ణందనసందేశ మిదె యనన్ హర్షితుఁడై. 359

క. ఒడి నిడుకొని శుకరాజము
మెడ నిమురుచుఁ జుంచు దువ్వి మేల్మే లని ము
ద్దిడుకొను, నక్కునఁ జేర్చును
దడఁబడువాక్యముల శివుఁడు తద్దయుఁ బల్కున్. 360

క. కుశలమె మీ దొరసానికిఁ
గుశలమె నా ప్రియసఖికినిఁ గుందరదనకున్
గుశలమె గిరిదంపతులకుఁ
గుశలమె మీ సకియబందుగులకుఁ జెలులకున్ 361

క. అను గిరిజేశుని పలుకులు
విని, మోదము పట్టలేక వేడుక మీఱన్
వినిపింపఁ దొడఁగెఁ జిలుకయుఁ
దనసఖిసందేశ మిట్లు తాత్పర్యమతిన్ 362

తే. విరహవేదన నోపక వెలఁది యిట్లు
బాధపడుచుండఁ జూచుట భావ్యమగునె ?
పిల్లికిం జెలగాటము పేదయెలుక
ప్రాణముల కది సంకటప్రదముగాదె ! 363

తే. మీకు విదితముగాని దేమియును లేదు
మన్మథుఁడు దలపెట్టు దుర్మార్గవృత్తి
నడఁప మీరే సమర్థు లో యగ్నినేత్ర !
భక్తవత్సలతను సార్థపఱుపుఁ డిపుడు. 364

ఆ. తమ్మికంటి కన్నుఁదమ్ములు ముడువక
తమ్మిదొరఁ బవళ్ళు తమినిఁ జూచుఁ
గలువకంటి కన్నుఁగలువలు విప్పియే
కలువచెలుని రేలు గాంక్షఁ గాంచు. 365

సీ. శబ్ద మే దైనను శ్రవణములం బడ
శర్వునిపలు కని సకియ వినును
స్పర్శ యే దైనను జర్మమునకుఁ దాఁకఁ
బశుపతిమృదుకరస్పర్శ యనును
రూప మే దైనను జూపులఁ జొచ్చిన
హరునిరూపం బని యతివ గనును
రస మేది యైనను రసనమునకు నంటి
శంభునియధరరసమని కొనును

తే. గంధ మేదైన సోఁకిన ఘ్రాణములకు
హరుని తనుగంధ మిది యని హాయి మనును
శివమయం బయ్యె జగ మంత చెలియ కిపుడు
విశ్వరూపుఁడ వీ వైతి విశ్వనాథ! ౩౬౩

సీ. మా. చంద్రునిఁ గాంచుచుఁ జంద్రచూడుం డని
ముద్దిడుకొనఁ బోవు ముద్దుగుమ్మ
వెన్నెల చుఱ్ఱుమన్వేఁడికిఁ దాళక
హా! యని కూలుఁ బర్యంకమందు
వ్యోమంబుఁ గాంచుచు వ్యోమకేశుం డని
తల నిమురం జనుఁ దలిరుఁబోఁడి
గంగాతరంగిణిఁ బొంగి యూర్మిఁ గనంగ
హా! యని కూలుఁ బర్యంకమందుఁ
ననలంబుఁ గనుఁగొని యనలనేత్రుం డని
కౌఁగిలింపఁగఁ గోరు గౌరి యంతఁ
గందర్పబాణాగ్ని కాఁకగా నోర్వక
హా! యని కూలుఁ బర్యంకమందు

భుజగంబుఁ గనుఁగొని భుజగభూషణుఁ డని
కరముఁ బట్టఁగఁ బోవుఁ గంజపాణి
చందనగంధ విషపవనములు గాఁగ
హా! యని కూలుఁ బర్యంకమందు

తే. నీలిమేఘంబునం గను నీలకంఠు
మృగమునందునఁ గాంచును మృగధరు నటు
మేను మది విప్పిపోవంగ మృగము పొంత
హా! యనుచుఁ గూలుఁ బర్యంకమందు బ్రాలు. 367

తే. అనిన నృపుఁడు లేచి యత్యాగ్రహమున
నీ విధంబునఁ బ్రియను బాధించునట్టి
ధూర్తులను బట్టి యిప్పుడే ద్రుంచెద నని
నాగభూషణుఁ డెత్తె పినాకధనువు. 368

తే. చంద్రుఁడు వడఁకుచు శివునిశీర్షమున డాఁగె
గంగ వణఁకుచు జడలను గప్పికొనియె
మనసిజుఁడు భయమున హరుమదినిఁ జొచ్చె
వాసుకియు మెడ వలఁగొని వదలఁ డయ్యె. 369

తే. సర్పములు చుట్టికొనియె హస్తభుజములకు
నగ్ని ముక్కంటికంటను నడఁగి యుండె
గళమును శరణు చొచ్చెను గరళ మపుడు
నృగునుగ్రత నెవ్వార లోపఁ గలరు! 370

వ. ఇంకను నామెవిరహబాధ విను మని శుక మిట్లనియె. 371

సీ. పూలు గోయంగ విభుఁడు మదిఁ దోఁచిన
బుట్టి క్రిందను బెట్టి భువినిఁ జూచు
బంతు లాడెడు నెడ బ్రభువు సంస్మృతి కెక్క
నాట వదలి మధ్య నాఁగి పోవు

నెగురవేయు తఱిని నీశస్మరణ గల్గఁ
బావురంబును నట్టె పట్టి నిలుచు
లేగడ్డిజొంపాలు లేళ్ళ కిచ్చెడు వేళ
శంభుని ధ్యాసలోఁ జలన ముడుగు

తే. హంసలకు నడనేర్పుచు నట్టె యుండుఁ
జిల్కలకుఁ బల్కు సెప్పుచు సిగ్గునందుఁ
దుమ్మెదలరొదలను విని త్రుళ్ళిపడును
ప్రాణనాథుండు సతి స్మృతిపథముఁ దోఁప. 372

క. కంటం గూరుకు జూన్యం
బొంటం బట్టంగనేర వోగిరములు, ము
క్కంటీ ! నినుఁ గోరెడు వా
ల్గంటిని నొకకంటఁ జూడు కారుణ్యనిధీ ! 373

క. కుడువదు విందులు, పార్వతి
ముడువదు సిగయందుఁ బూలు, ముట్టదు ప్రీతి
న్నిడెడు నలంకరణమ్ములు
నుడువదు ప్రియలాడు ప్రేమనురుగులకు బదుల్ 374

క. దండించితి, కాలుని మా
ర్కండేయునిఁ బ్రోచుటకు జగము మెచ్చఁగ నీ
యండను జేరిన యబలను
దండించుట ధర్మ మగునె ? దాక్షిణ్యనిధీ ! 375

ఆ. బల ముడిఁగినవాఁడు బలవంతుఁ డెట్లగు ?
విభవహీనుఁ డెపుడు విభుఁడు నగునె ?
విద్యలేనివాఁడు విద్వాంసుఁ డెట్లగు
వేదబాహ్యుఁ డైన విప్రుఁ డగునె ? 376

ఆ. తావి శూన్యమైనఁ బూవు భాసించునె ?
జ్ఞానదూరుఁ డైన జ్ఞాని యగునె ?
శక్తి వాసి నీ వశక్తుండ వైతివి
శక్తిఁ గూడు సర్వశక్తియుక్త ! 377

ఆ. అనఁగ వినుచును శివుఁ డాశ్చర్యచకితుఁడై
చిలుకపలుకులె ! యివి చిత్ర మనుచు
నగజయందు మిగుల ననురాగ ముదయింప
ననియె నిట్లు చిలుక కభయ మిడుచు 378

మ. కలయందైనను విస్మరింపను సుమా ! కంజాతపత్రేక్షణన్
లలనారత్నము పాణిపంకజముఁ గేలం గొంచుఁ బాలించెదన్
జలజాలానన నొప్పుగా మురిపెపున్ సంద్రంబునన్ దేల్చెదన్
జిలుకా ! యీ శుభవార్తఁ దెల్పు మిఁక రంజిల్లంగ మీ నేత్రముల్

క. జాడ్యము లే దిఁక నా యెడఁ
బాడ్యమి తిథి నిన్న శుక్లపక్షము పగలే
మౌఢ్యంబు తీఱె, మునుల, గు
ణాఢ్యులఁ బంపితిని కన్య నడుగుట కొఱకై 380

తే. సర్వమును సిద్ధ మిచ్చట సప్తఋషుల
రాకయ తడవు పెండ్లికి రాఁగల మిఁక
సంశయము మాను మనుమ నిశ్చయ మిది సుమ
యభయ మిచ్చుచునుంటి నే ననఁగ శుకము 381

క. ఎక్కుఁము నా ఱెక్కలపై
నిక్కడ నున్నట్టె నిన్ను నీ క్షణమందే
యక్కడఁ జేర్చెద నీకై
మక్కువతో నెదిరి చూచు మానినికడకున్ 382

తే.మా. అనఁగ శర్వుఁడు నవ్వి గణాళితోడఁ
బెండ్లికిఁ దరలి వచ్చెద వేగ పోయి
యిచటి వార్తను దెల్పు మా యిందువదన
కనఁగ శుకము మనోవేగమునఁ బఱచుచు
విరహతాపంబు దీర్చెడి వృష్టి యనఁగ
శివుని యాగమ శుభవార్త చెప్పె సతికిఁ
జిత్తమున స్వస్థతఁ గాంచెఁ జిగురుఁబోడి
నిండు శ్వాసను ఓల్చె నా నీలవేణి
ప్రాణదానంబు చేసిన ప్రాణసఖిని
నీ ఋణము దీర్చుకొనలేను నేను జన్మ
జన్మముల కైన నిద్ది నిజం బటంచుఁ
గౌఁగిటను జేర్చి బిగియించె గారవించె 383

క. చెక్కిలి ముద్దాడుచు నమ
యక్కునఁ జేర్చికొను దాని నానందముతో
నెక్కించుకొనును నెత్తిన
మక్కువఁ జూపించు బహుళ మాన్యత మెఱయన్ 384

వ. ఇట్లు సంతోషతరంగితాంతరంగ యై పార్వతి 385

క. హర ! సాంబ ! సదాశివ! శం
కర ! శంభో ! పాహి పాహి ! కారుణ్యనిధే !
వరదా ! నా మొఱవిని, కని
కరమునఁ గరమును గ్రహించి కావఁగ రావే ! 386

వ. అని ప్రార్థించుచుఁ బ్రియునిరాకకై చంద్ర చకోర న్యాయమున
నెదిరి చూచు చుండె నంత నక్కడ శివుని నాదేశంబున
మౌనివరులు 287

తే. శంకరుని భక్తిఁ దలఁచుచు సంతతమున
నోషధీప్రస్థపురమున కొప్పుఁ జేరి
నగర సౌందర్యదర్శనానంద మంది
మందిరము సొచ్చి వచ్చు నమ్మౌనులకును 388

మ. హిమవంతుం డెదురేఁగి సన్మునుల నర్చించె న్మహాభక్తిఁ బా
దముల న్గడ్గి సుఖాసనంబు లిడి హస్తాబ్జంబులన్ మోడ్చి సే
మములే మీకుఁ బరోపకారకులకున్ మానుండి యే మైనఁ గా
ర్యము లున్నన్ సెల విం డొనర్చెదము భాగ్యం బద్ది మా కం
చనన్ 389

శా. ఏదీ! యిట్టి యదృష్ట మీ జగతిలో నెవ్వారలం బొందె ? నీ
సాదృశ్యంబును గాంచఁ జాలఁడు గదా? సంద్రుండు తాఁ గన్నల
క్ష్మీదేవిన్ హరి కిచ్చియున్; సతియ తా జన్మించె మీ యింటిలో
నా దేవాధిపుఁ డిందుశేఖరుఁడు దానై కోరె మీబిడ్డఁ గ
న్యాదానం బొనరించి తత్సుకృతమున్ ధన్యాత్మ ! చేపట్టవే 390

వ. అను నమ్మహర్షుల పలుకులు విని మహానందకందళిత హృదయార
విందుండై 391

సీ. పార్వతీజనకుండు పట్టఁజాలక హర్ష
మేనుఁ గెక్కిన యంత నెదిగి పోయె
బిడ్డను బిలిపింప బిడియపడుచు నామె
మునులకు సాష్టాంగముగను మ్రొక్కె
వరదహస్తము నెత్తి 'వరుని కేలు గ్రహించి
వడయుము శుభపరంపర' లనుచును
దీవన లిడిన సందీప్తి మోమునఁ బాఱ
ధంతధ్వులు సేరె దానితోడఁ

తే. జెక్కుటద్దంబులందునఁ జెలఁగెఁ గెంపు
కర్ణభూషల కెంపుల కాంతి మించెఁ
దలను వంచెను దృష్టి భూతలము మెఱయఁ
దుఱ్ఱుమని లేచి పరు గెత్తెఁ దోయజాక్షి

పంచచామరము. శుభస్యశీఘ్ర మంచు నా ఋషుల్ విధిజ్ఞులున్, మహా
నుభావు లార్యు లైన బ్రాహ్మణుల్ వినిశ్చయించఁగన్
శుభగ్రహస్థితుల్ శుభంబు చూపఁగా హిమాద్రి భూ
విభుండు హర్ష బాష్పధార వీడ లగ్న మేర్పడెన్ 393

వ. అంత నా హిమవంతుండు వివాహసుముహూర్త పత్రిక మహర్షుల
కందఁ జేసి, సగౌరవ సబహుమానంబుగా వారల సాఁగ నంపిన
వా రా వృత్తాంతంబు శివున కందించి చని రంత హిమవంతు
నంతిపురంబున మేనకాదేవి,

క. ఇందువదనఁ, గుందరదన,
మందగమన, నందనను నమందానందన్
నిందీవరనయనను దన
ముం దిడుకొని కుందఁ దొడఁగె మోహితమతియై 395

ఉ. ఎందుకు బ్రహ్మ నిన్ను సృజియించె? సృజించెను బో! నతండు నీ
కెందుకు నింతచక్కఁదన మిచ్చెనొ? యిచ్చెను బో! శుభాంగు, రా
కేందునిభాస్యుఁ డొ మగని నీయక పోయెనె? యీయ కుండెఁ బో!
మందుని వెఱ్ఱిబాగుల యమాయకునిం బతిసేయు టెందుకో ?

వ. శివుని మహిమను గమనింపక యిట్లు దురపిల్లు భార్యను గని
హిమవంతుండు సదాశివుని విశిష్టతను స్థాపించుచు నిట్లనియె

క. బేలా ! యేడ్చెద వేలా ?
వేళావేళలను గనవు; వెఱ్ఱియ చాలున్,
లీలావతారుఁ డని ముని
లోలునిఁ బొగడంగ వినవె ? లోలాక్షి ! మునుల్ 398

సీ. ఎవని పాదములకు నింద్రాదులు కిరీట
మణిహారతులు సమర్పణ మొనర్తు
రెవని పాదములు యోగీంద్రు లెల్లప్పుడు
హృదయపీఠములందు నెలమిఁ గొల్తు
రెవని పాదపరాగ మింపుగా భక్తులు
శిరమున ధరియించి చెన్ను గాంతు
రెవని పాదసుతీర్థ మేప్రొద్దు సేవించి
పాఱఁ ద్రోలుదురు పాపములు ఖలులు

ఆ. అట్టి పరమశివుని యా పాదపంకేరు
హములు గడుగు భాగ్య మబ్బె మనకు
మురియుటకును బదులు ముందు బిడ్డను గొని
వగచు చుంటి విది యవాంఛితంబు 399

తే. ధన్యులము, కంటి మీమెను దపముచేతఁ
దపముచే నీమె ముక్కంటి దయను గాంచెఁ
దపముచేఁ గొందు మా చంద్రధరుని కృపను
తపమునకు సాటి లేద యీ ధరణి వినుము 400

క. అను ననునయ హితములు విని
సునయన స్వస్థతను గాంచి సుందరములు శో
భనపుంద్రవ్యంబుల నె
ల్లను సమకూరుపఁ బనిచె విలాసినులఁ దగన్ 401

## ఉమామహేశ్వరుల వివాహము

క. శర్వునిఁ దలఁచుచుఁ గార్య సు
నిర్వహణమునందు నిల్పె నేర్పులను, దా
సర్వదిశల దూతలచేఁ
బర్వతరా జప్పుడు శుభపత్రిక లంపెన్ 402

వ. అంతఁ గైలాసంబునుండి మహేశుండు పెండ్లికొడుకై తరలివచ్చు
విధానం బెట్టి దనిన 403

మ. మా. అదిగో! వచ్చెను బెండ్లికై తరలి తా హర్షంబునన్ నందిపైఁ
గదల న్నేర్చిన వెండి కొండయ యనం గైలాసనాథుండు స
మ్మద మేపారఁగ దేవతావిభుఁడు దా ముందుండఁ బార్శ్వంబులన్
మది నుప్పొంగుచు బ్రహ్మవిష్ణువులు క్షేమం బొప్ప సాఁగంగ నా
రద ముఖ్యుల్ ఋషి మౌనివర్యులును స్తోత్రంబుల్ పఠింపంగ నా
చదలన్ దుందుభితూర్య నిస్వన విశేషంబుల్ సెలంగన్ గడున్
ముదితల్ లాజలు పుష్పరాజముల సమ్మోదాశ్రులుం గుర్వఁగం
గదముల్ ద్రొక్కుచు శైవ సైన్యములు వెన్కన్ బారులై
నడ్వంగన్ 404

తే. శివుఁడు నోషధీప్రస్థంబుఁ జేరఁ జనఁగఁ
జలువమలఱేఁడు సకుటుంబ సపరివారుఁ
డయి సమస్త శోభన వస్తు చయముతోడఁ
బూర్ణకలశములను గొని భూసురాళి
మంగళారతులఁగొని పుణ్యాంగనలును
నడువ మంగళవాద్య నినదము లొనర
వందిమాగధుల్ కీర్తులఁ బాడు చుండ
శిష్టవేదోక్త సూక్తముల్ సెలఁగు చుండ 405

చ. ఎదురుగ నేఁగి యాత్రిభువనేశునిఁ దోడ్కొనివచ్చి సంతసం
బొదవఁగఁ బెండ్లిగద్దెపయి నుంచి, వధూమణి వామదిక్కునం
బదిలముతోడఁ గూర్చి, మధుపర్కము లిచ్చి, శశాంకమౌళికిన్
బదములు భక్తితోఁ గడిగి, పార్వతి నిచ్చెను దానధారతోన్

వ. మఱియును 407

శా. గోదానంబు, హిరణ్యదానమును, నా గోత్రాధినాథుండు భూ
మీదానంబును, స్వర్ణదానమును లక్ష్మీనాథు ప్రీత్యర్థ మా
హ్లాదంబొప్ప సదక్షిణాకముగ సాలగ్రామ దానాదులన్
మోదాశ్రుల్ గనులందు నొల్కఁగను శంభుంగూర్చి వేదోక్తిగన్

వ. సభక్తికంబుగా సమర్పణం బొనర్చె నంత నీలగళుండు 409

సీ. కంకణంబు ధరించెఁ గరమునఁ ద్రిభువన
కల్యాణమునకుఁ గంకణ మనంగఁ
దెఱఁ దీయఁ బ్రియురాలిఁ దిలకించెఁ బ్రీతితోఁ
ద్రిజగంబులను బ్రేమఁ దేల్చె ననఁగ
గళమునఁ గట్టె మంగళసూత్ర మిదియ లో
కంబుల కెల్ల మంగళ మనంగ
జిలకఱ బెల్లము శివుఁడు తొలుతఁ బెట్టెఁ
సృష్టియే తన వశీకృత మనంగ

తే. ననిమిష నిమేష జనులు తిర్యగ్జడములు
పార్వతీ శంకరుల పెండ్లి పరమశోభఁ
బ్రకృతి పురుషుల కిద్ది వివాహ మంచు
హర్షడోలాయ మానసు లై చెలఁగ 410

ఉత్సా. హాసవదన దేవవనిత లాడుచుండ నాట్యముల్
వాసిగా సువాసినులు నివాళు లిచ్చి పాడఁగన్

భూసురాళి దీవనలను బుష్కలము లొసంగఁగన్
వాసవానుచరులుఁ బూలవానఁ బైన గుఱియఁగన్ 411

మేలనగీతి. భాసురముగ మంగళకర వాద్యములును మ్రోయ
దోసిళులను నింపికొంచుఁ దోరపు రతనముల
సేస లొకరిపైన నొకరుఁ జెలు వమరఁగ శివులు
పోసికొనిరి ముజ్జగములు మురిసి మురిసి పోవ 412

శా. ఆరాధించి మహాగ్నిహోత్రమును భక్త్యాధిక్యతన్ నూత్న సం
సారంబున్ గ్రహియించి, సప్తపదితో, సౌభాగ్య సంపత్తిఁ జెం
పారం గొల్చిరి వ్యోమవీధిని వసిష్ఠారుంధతీ తారలన్
గౌరీ శంభులు బ్రాహ్మణాళికి నమస్కారంబు లందించుచున్

వ. అనంతరంబ

తే. కట్నములు చదివించిరి, కానుకలును
బహువిధముల నొసంగిరి ప్రజలు ప్రీతి
దేవతాళి సమర్పించె దివ్యవస్తు
చయము శివులకు లోకముల్ సంబరపడ 415

తే. అంత, షడ్రసోపేత మృష్టాన్న శాక
పాక, పంచపక్వాన్నముల్, పాయసములు
భోజనము చేసి, తృప్తిగా భోక్తలిట్టి
విం దహో! న భూతో న భవిష్యతి యన 416

క. చందన తాంబూలంబులు
సుందర వస్త్రాభరణ కుసుమహారాదుల్
పొంది రతిథి మర్యాదల
నందీయఁగ నిందువదన, లానందముతోన్ 417

వ. అప్పుడా మేనకాహిమవంతులు శివునకుఁ దమకూఁతునప్ప
గించుచు రుద్ధకంఠంబున. 418

అక్కలిప్రాస సీ పెంచితి మిన్నాళ్ళు, పెద్దజేసితి మప్ప
గించితి మయ ! బిడ్డ నిపుడు మీకు
ముంచియెత్తుచు, పాల ముంచియెత్తుమ నేఁత
మించుఁబోఁ డిఁక మీఁద మీదసొత్తు
సంచితపుణ్యవశంబున నీమె మీ
పంచఁ జేరెను మీదె భార మంచు
మంచిగుణంబుల మదవతు లందఱ
మించును సుమ్మి యీ మీననయన

ఆ. పంచబాణవైరి ! పంచాస్య ! శివ ! తల
వంచు మీకు నెపుడు వామనేత్ర,
యెంచి చూడఁ గష్ట మెఱుఁగ దీయమ దయ
యుంచి ప్రోవు మయ్య ! యో మహేశ ! 419

తే. అనుచు గిరిశునకుం గూఁతు నప్పగించి
బిడ్డనక్కునఁ జేర్చి, ప్రీతిచెలఁగ
ముద్దు లిడికొని యామె చుబుకము వట్టి
పుడమిఱాలుపుజేఁ డిట్లు బుద్ధి గఱపు 420

సీ. పతిసేవ సతులకుఁ బరమధర్మము గానఁ
బ్రేమతోఁ గొను వానిప్రేమ లమ్మ !
భర్తసుఖంబె పో ! భార్యసౌఖ్యము వాని
యష్టానుగతిఁ బ్రవర్తింపు మమ్మ !
మగఁడు కోపించిన మాఱు మాటాడక
మృదుమధురోక్తుల మెలఁగు మమ్మ !
విభునినోటను మాట వెడలకమును దాని
గ్రహియించి కావింపఁ గడఁగు మమ్మ !

తే. తం|డివాక్యములను మది( దల(పు మమ్మ !
యుభయతారక మై యది యెప్పు నమ్మ !
పుట్టినింటిది, మెట్టినయట్టియింటి
గౌరవము నిల్పు మమ్మ ! బంగారుబొమ్మ ! 421

మంజరీ ద్విపద

అల్లునిమర్యాద లనుపమములుగ
మామపంక్తిని( గొన్ని మానముల్ గుడిచి
కట్నముల్ కానికల్ ఘనముగా నొంది
పయన మయ్యెను గృత్తివాసు( డింటికిని
|బకృతిసౌందర్యముల్ బాగుగా మెచ్చి
వనవిహారములకై వాంఛ లుప్పొంగ(
బరివారముల నెల్ల( బంపించి వైచి
మార్గమధ్యమున నుమా|పియు( డా(గె
వనభూములందును వసియించు చుండె
గిరికందరములందు( గ్రీడించు చుండె
బుష్పవాటికలందు( బొదరిండ్లయందు(
బులినప్రదేశాల( బూసెజ్జలందు
సెలయేళ్ళ ప్రక్క( బచ్చికబీళ్ళయందు(
బ్రణయకేళులు బహుభంగులు సల్పి
సమరతు లుపరతుల్ సర్వరతుల, మ
హానందవార్ధి( గాత్యాయనిం దేల్చి(
బద్మాకరముల భవానితో( గూడి
లక్షణంబుగను జల|కీడ లాడు(
దీ(గయూయెలలోన( దేజం బెసంగ
నొయ్యారముగ శివు లూ(గుచు నుండు
రూర్ధ్వరేతస్కు(డై యుత్సాహ మెస(గ
సౌఖ్యములం దన్ను స్ఖలనంబు లేక

వ్యాహారనిద్రా ద్యవస్థలు లేక
ప్రేమరాజ్యము శివాప్రియుఁ దేలుచుండె
సంవత్సరంబులు క్షణములు గాఁగ
దివ్యహాయనములు దెలియక గడచె. 422

మ. అటకైలాసపురస్థపుష్పవనవాహ్యాళీవినోదుండు, చెం
గటఁ జిచ్ఛక్తి యనంగఁ జెల్లెడు సతీకాంతా సమేతుండునై
నటరా జొప్పెను, యామినీపతుఁడు జ్యోత్స్నాయుక్తుఁడై తారకా
పటలోపేతన భోంతరస్థుఁడగుచున్ భాసించెనో యంచనన్

క. శివశక్తులకడుపున నం
భవమొందెఁ గుమారుఁ డనుకుమారుఁడు, సురవై
భవముల దోఁచిన తారక
దివిజారిం ద్రుంచి, మాన్చెఁ ద్రిభువనభయముల్ 423

వ. అనుచు సూతుండు కథితం బొనర్ప శౌనకాదులమందానంద కందళిత హృదయారవిందు లై యప్పరమపౌరాణికుని తోడం గూడి శివలీలల చెలువు నగ్గించుచుఁ దమమనః కందంబుల వెలుఁ గొందు నయ్యాదిమదంపతుల కిట్లు మంగళంబు వల్కిరి. 424

మంగళమహాశ్రీ

మంగళము శంభునకు, మంగళము పార్వతికి
మంగళము నిత్యశుభ మంచున్
నంగభవవైరిని, శుభాంగి, యుమ, గౌరి ధవ
శాంగహరితాంగులను నిట్లు
పొంగుచును వారి మనముం గొనుచు, దీనిఁ బ్రియ
ముం గని పఠించెడు జనాళిన్
సంగతిగఁ బ్రోచెడు సుసంగులకుఁ బాడిరి, వి
సంగులును మంగళమహాశ్రీ. 425

ఉ. అంబుజపత్రనేత్ర ! గిరిజాస్యసరోరుహమిత్ర ! యో మన
స్సంభవహర్త ! సత్పురుషసంస్తుతిపాత్ర ! సతీకళత్ర ! వి
శ్వంభర ! పావనోత్తరదిశాధిపమిత్ర ! పవిత్రగాత్ర ! క్షే
మంబులు గూర్చు మంత్రపురమందిరసుందర ! యిందుశేఖరా !

ఇంద్రవజ్ర. కైలాసనాథా ! హర ! కాలకంఠా !
ఫాలానలాక్షా ! శ్రితపాపలుంఠా !
లీలావతారా ! శివ ! లింగమూర్తీ !
శూలాయుధా ! సన్నుతశుద్ధకీర్తీ ! 427

మాలిని. సురవినుతచరిత్రా ! సూరివంద్యా ! త్రినేత్రా !
కరధృతనగచాపా ! కామకోటిస్వరూపా !
యురుభుజగవిభూషా యుగ్ర ! భక్తార్తిశోషా !
నరకభయవిదూరా ! జ్ఞానవైరాగ్యసారా ! 4 8

*

ఇది శ్రీవత్ససగోత్ర పవిత్రాపస్తంబసూత్ర, రాజయ మంత్రజ్ఞ
పౌత్ర లక్ష్మణకవివర పుత్ర రాజేశ్వర కరుణాపాత్ర
సుకవిజన కమలమిత్ర గంగారాజేశ్వర కవిశేఖర
ప్రణీతం బగు పార్వతీవిజయ ప్రబంధమున
గిరిజాకల్యాణం బను తృతీయఖండంబు
సర్వంబును సమాప్తంబు.

మంగళమ్మహత్

# కృతికర్త యితర రచనలు

1. రుక్మిణీ కల్యాణము - ముద్రితము

2. పార్వతీ విజయము - ముద్రితము

3. గీతాగానము - అముద్రితము

4 పరీక్షిత్తు - అముద్రితము

5. ఆత్మబోధ శతకము (భగవన్నుతి)

6. గంగారూపకములు
మల్లె, రామరాజ్యము, క్రాంతి (ఝాన్సీలక్ష్మి); ఎన్నికలు వస్తున్నాయి.

7. శ్రీ రత్నకాంత నాటకము, 8, కుచేలోపాఖ్యాన హరికథ అనురెండు,
కృతి కర్తపితృదేవులు కీ. శే. శ్రీగంగా లక్ష్మణరావుగారి కృతులు.